# శ్రీబోయకొండ గంగాభవాని చరిత్ర





రచయిత:

జె. వరలక్ష్మి

వెల : 11 రూ॥

# శ్రీబోయకొండ గంగాభవాని చరిత్ర



రచయిత:

జె. వరలక్ష్మి

This book is published with the financial assistance of Tirumala Tirupati Devastanams under their scheme and to Publish Religious books.

# శ్రీ బోయకొండ గంగాభవాని చరిత్ర

రచయిత
జె. వరలక్ష్మి

చిరునామా :
పిట్టావాండ్లపల్లె రెడ్డివారిపల్లి (పోస్టు)
నిమ్మనపల్లి మండలం
చిత్తూరు జిల్లా

ముద్రణ :
వైభవ్ ఆర్ట్ ప్రింటర్స్
మదనపల్లె - 517 325



తొలిప్రచురణ 1993

# తొలిమాట

నేను శ్రీ దొర బోయకొండ గంగాభవాని అగు అమ్మవారి చరిత్రను ఏ విధముగా వ్రాయగలిగితిననగా! 15 సం॥లు శ్రీ మద్విరాట్ పోతులూరి వీర బ్రహ్మేంద్రస్వాములవారి సేవలోభక్తి శ్రద్దలతో నిమగ్నుడనైయుంటిని. ఒకనాటి రాత్రి స్వప్నమందు ఒక వృద్ధ బ్రాహ్మణునివలె నొసటున నామంబులిడుకొని మెడ యందు రుద్రాక్షమాలలు ధరించి నన్నుంగాంచి నాయనా! నీపై ఒక్క కార్యభారమును మోపుచున్నాను. తత్కార్యమును నీవే నిగ్రహించవలయునని ఈ విధముగా జెప్పెను. మీ పొలిమేరల సరిహద్దులయందు దుర్గమయమయిన కొండ ప్రదేశముపై శ్రీ దొర బోయకొండ గంగాభవానియను నామమముతో వెలసి, భక్తులకు అనేకము లయిన మహిమలను చూపుచున్నది. అట్టి జగజ్జననీ స్థలపురాణమును నీవు ఒక పురాణగ్రంథ రూపముగా లిఖించి ప్రజానురంజకముగా లోకవ్యాప్తి చేయమని, అట్లు వ్యాప్తించునట్లు చేసినయెడల నేనున్ను, అమ్మవారున్ను నీకు అండదండలుగానుండి నడిపింతుమని చెప్పగనే నాకు మెలుకవ వచ్చినది. అనాటి నుండి శ్రీ స్వామివారి ఆనతి ప్రకారం ఆలోచించుచూ అనేక ప్రదేశములు తిరిగి తెలిసిన పెద్దల సలహాలతో ఈ చరిత్ర వ్రాయగలిగితిని. ఇట్టి చరిత్రను చదివినవారు అమ్మవారి దయకు పాత్రులై ఆయురారోగ్య ఐశ్వర్యములకు పాత్రులగుదురు. ఇట్టి చరిత్రను గృహ ములందుంచుకొని ఏ కార్యార్థమైనను పోవునపుడు తల్లిని తలచి పుస్తకమును శిరమును తాకించిన కార్యసిద్ధియుం కల్గును.

భక్తిశ్రద్ధలతో చదివినను ఎల్లప్పుడును ధ్యానించినను కష్టములు తొలగును. గృహపీడలు తొలగును. ఆయురారోగ్య ఐశ్వర్యములు ప్రాప్తించును.

స్తోత్ర పుస్తకమునందు గల రహస్యములను ప్రతి ఒక్కరు పఠించవలయునని కోరుచున్నాను. మరియు ఈ పుస్తకమును ముద్రించుటకు ఆర్థిక సహాయమొసంగిన తిరుమల - తిరుపతి దేవస్థానం వారికి నా కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాను.

చిత్తూరు జిల్లా. చంద్రగిరి మండలం మిట్టపాళెం వాస్తవ్యులు రెవెన్యూశాఖో న్నత ఉద్యోగులు, ఆఖరి దశయందు గుర్రంకొండ M R. O. హోదాలో యుండి ఇటీవలనే శాశ్వతముగా కన్నుమూసిన -యస్. రామచంద్ర నాయుడుగారు ఈ పుస్తక మును స్వయముగా తిలకించి సవరించియున్నారు. వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభి వందనములర్పించుచున్నాను.

— జె. సూర్యకుమార్



# శ్రీదార బోయకొండ గంగాభవాని చరిత్ర

శ్రీకృష్ణదేవరాయుల వంశ పతనానంతరము ఆంధ్రదేశము మహమ్మదీయుల వశమైనది. మహమ్మదీయుల మత వాతావరణముతో నిండి హైందవుల సభ్యత, సంస్కృతులు కలుషితమైనవి, ఆ తురుష్కులు తెలుగువారిని అనేక బాధలు పెట్టుచూ వారికి లోబడినవారిని వారిమతమున కలుపుకొని, వారిని ఎదిరించినవారిని నాశనమొన రించుచూ, పరరాజ్యములపైబడి ఆ రాజ్యములను కొల్లగొట్టి వారి వశము చేసుకొనుచుండిరి. అదియునుంగాక హిందూ దేవాలయములను ధ్వంసము చేయుచూ అందుగల విగ్రహములను కూడ అపహరించుచుండిరి.

మహమ్మదీయులు హిందువులను అవ్విధముగా బాధలు పెట్టి వారి స్త్రీలను చెఱబట్టి వారి వ్రతములు చెఱుపుచున్ననూ వారికి ఎవ్వరును అడ్డు లేనందున వారి దౌర్జన్యములు రోజు రోజుకు మితిమీరి దేశమంతయు అల్లకల్లోలముగా నుండెను.

అట్టి సమయంబున భూదేవి కలియుగంబున మహమ్మదీయులు చేయు ఘోర పాపములను చూచి సహించక వారి గర్వమణచుటకు ఏది మార్గమని ఆలోచించి సర్వేశ్వరుండైన మహావిష్ణువుతో మొర పెట్టుకొనుటకు వైకుంఠమునకు వెళ్ళెను.

శ్రీమన్నారయణుడు శేషతల్పముపై పవళించియుండ అతని మృదు పాదంబులను లక్ష్మీదేవి ఒత్తుచూ సంతోషంబుగానున్న సమయంబున సర్వ ప్రపంచంబును మోయునట్టి భూదేవి గోడు గోడున దుఃఖించుచూ వారి చెంతకు విచ్చేసి అతనికి నమస్కరించి నిలుచుండెను. భూదేవి దుఃఖించుట గాంచిన మహావిష్ణువు ఆమెను చెంతకు పిలిచి నీవు చింతించుటకు కారణంబేమి అని అడుగుగా అందులకు భూదేవి అతనితో ఆదిమధ్యాంతరహితా! దేవా! శ్రీమన్నారాయణా! దేవ దేవా! నేను మూడు యుగముల భూభారము సునాయాసముగా మోయుచుంటిని. కాని ఇప్పుడు కలియుగమున మానవుల పాపములచే కూడుకున్న ఈ భూభారము మోయలేక బాధపడి మీ చెంతకు వచ్చినాను. ఇందులకు తరుణోపాయంబు తెల్పవలెనని ప్రార్థించెను.

ఆ మాటలు విన్నట్టి శ్రీమన్నారాయణుడు ఆమెను ఓదార్చి ధైర్యం చెప్పి కొంత తడవు ఆలోచించి భటులనంపి రుద్రదేవుని బ్రహ్మదేవుని అచ్చటికి రప్పించి భూదేవి చెప్పిన మాటలువారితో చెప్పగా వారును ఆలోచించి ఏమి చేయుటకును దిక్కు తోచక

బూదేవిని వెంటనిడుకొని జగజ్జనని చెంతకు వెళ్ళిరి. ఆ సమయంబున జగజ్జనని యోగనిష్ఠలో కూర్చునియుండుట గాంచి వారు అచ్చటనే కూర్చునిరి. కొంత తడవునకు జగన్మాత కన్నులు తెరచి వారి వంక చూచి మీరు ఇట్టి సమయంబున వచ్చుటకు కారాణంబేమి యని పశ్నించగా అందులకు త్రిమూర్తులు ముగ్గురు కలసి భూదేవి కలియుగంబున జరుగు ఘోరములను గూర్చి తమకు చెప్పినదంతయు జగజ్జననికి విన్నవించిరి.

ఆ వార్త విన్నట్టి జగజ్జనని కోపోద్రిక్తురాలై మండిపడి ఔరా! మానవులకు ఇంతటి గర్వమున్నదా! మన సృష్టియందే ఉద్భవించినట్టి సర్వ మానవులకు అంతటి గర్వమా! వారిని ఇప్పుడే సర్వనాశనము చేయవలెనని యెంచి కొంతవడి మౌనము వహించి ఆలోచించుకొని ఇప్పుడు తొందరపడుట శ్రేయస్కరముగాదు. కలియుగ భారమంతయు కలిపురుషునికి ఒప్పజెప్పినందున యేమి చేయుటకును వీలుగాదని భావించి, కొంత తడవు యోచించి త్రిమూర్తులారా! దీనిని గూర్చి మీకు యేలాంటి చింతయు వలదు. ఏలనగా మనము ముందుగనే ఇప్పుడు జరుగు కలియుగ దుష్కృంత ములన్నియు ఆ కలిపురుషుడు పరిష్కరించునట్లుగా నిర్ణయించి యున్నాము. అయినను ఇట్టి సంవర్భమున దుష్ట శిక్షణ శిష్ట రక్షణ యొనరింప మనమే పూనుకొనవలెను ఏ యుగమునందు కూడ జరుగనట్టి పాపములు కలియుగమున జరుగుచున్నవి. అందువలన పాపమెక్కడ మెండుగా వుండునో మనము అచ్చట అవతరించి పరిపాలన జేయవలెను కావున మీరు మీ ప్రస్తుత రూపములు విడచి దేశమంతట అచ్చటచ్చట అవతారములెత్తి అచ్చట జరుగుపాపకృత్యములను ఖండించి భక్తిమార్గమును చూపుచుండవలెను. అదియు గాకా నేనున్ను మీ వలె అవతారమెత్తి అచ్చట మీకు తోడుగా వుండి ఏది యెట్లు చేయవలెనో సూచింతును. మీరందరు అదే విధముగనే కలసి చెయుడు అని చెప్పి వారిని వారి వారి నివాసంబులకు పంపెను. భూదేవిని కూడ ధైర్యముగా వుండమని ఓదార్చి జగజ్జనని తపోనిష్ఠలో కూర్చుండెను. నాడు జగజ్జనని తానిచ్చినమాట ప్రకారం అవతరించి దేశమునందంతయు సంచరించి దక్షణ ప్రాంతమునకు వచ్చెను. మహమ్మ దీయుల ప్రవర్తనలను గాంచి వారి గర్వము అణచుటకు వారిని హతమార్చి శాంతి నెలకొల్పి తెలుగు జాతిని పునరుజ్జీవింపజేసినట్టి శక్తిస్వరూపిణియే ఈనాడు బోయ కొండ శిఖరముపై వెలసినది. ఈమె చరిత్ర ఈ విశ్వజననియైన పరాశక్తి అవతార మహిమలు సంగ్రహముగా ఈ గ్రంధమున పేర్కొనబడినవి.

మూర్తి ఒక్కటేగాని వేరు వేరు అవతారములెత్తినపుడు పేర్లు వేరైనవి. ఆది యందు జగజ్జనని ఒక్కటే. ఆ శక్తి త్రిశక్తి రూపిణి అనగా బ్రహ్మ, విష్ణు

మహేశ్వర, లక్ష్మి, పార్వతి, సరస్వతి వీరి స్వరూపములే. ఆ తల్లియే బోయకొండ శిఖరముపై బోయకొండ గంగమ్మగా నిలిచి ఆ ప్రదేశమంతయు నిండుగా నెలకొని, భక్తులు పిలిచిన చోటుకువెళ్ళి వారి కష్టసుఖంబులను గమనించి అనుగ్రహించి తన మహిమలు చూపుచున్నది.

ఈ క్షేత్రము యొక్క మహిమ వర్ణనాతీతమైనది. మరియు ఈ దివ్య చరితామృతము చదివి ఆనందింపదగినది దీని మాధుర్యము చదువరులకు అనుభవయోగ్యమగును. కనుక ఇందలి శ్లోకములను ప్రతివ్యక్తి అంతో ఇంతో పఠించిన యెడల ఆ తల్లి అనుగ్రహమునకు పాత్రులౌదురు.

ఇప్పుడు బోయకొండ అమ్మవారు మంత్రమూర్తియై, యోగనిమగ్నమై శాంత గంభీరములచే తపోనిరతమైనది కలియుగమున భక్తుల అభీష్టార్థమై తన అభయ హస్తములతో ఆహ్వానించి ఆనందింపజేయుచున్నది. మరియు పలురూపములలో నానా విధముల సహాయము చేయుచున్న బోయకొండ అమ్మవారిని నమ్మి చెడిన వారులేరు. ఇది సత్యము.

జగజ్జనని యైనట్టి బోయకొండ అమ్మవారు మోక్షప్రదాయినియై ముక్తి దాయకమై కలియుగమునందు నమ్మిన భక్తులకు కల్పతరువై, కామధేనువై, కష్టములలో నుండు భక్తులను కారుణ్య కటాక్షములచే కాపాడుచున్నది.

## కథాప్రారంభము

* * *

కొన్ని వందల సంవత్సరములకు పూర్వము ఆంధ్రదేశమున గంధవడీ అను నొక పట్టణముండెను. ఆ పట్టణము పుణ్యాత్ములకు పుణ్యవతులకు సిద్ధయోగులకు పండితులకు నిలయమై ధన ధాన్య సంపదలకు ఏలోటు లేక తులతూగు చుండెను.

ఆ నగరము చూపరులకు కట్టడములు అనేక వింత శిల్పములతో నిర్మితంబై కనులవిందొనర్చును ప్రాకారంబులు కలిగి వజ్ర వైడూర్య మరకత మాణిక్య మణి మయంబులతో నిండియున్న రాజ సౌధంబులు గలిగి నిత్యము పచ్చ తోరణములచే నలంకరింపబడిన పురవీధులు గలిగి ఆ పురము అలరారుచుండెను.

అట్టి రాజ్యమును గిరి మహారాజు రాజ్యపాలన చేయుచుండెను. ఆ రాజ్యమున నెలకు రెండు మారులు వర్షంబులు గురిసి గోవులు గేదెలు రెండు పూటల పాలు పితుకుతూ పాడి పంటలతో సస్యశ్యామలముగానుండెను. ప్రజలకేకొరతయు లేక జీవనము గడపుచుండ మహారాజు ప్రజలను కన్నబిడ్డలవలె కాపాడుచూ వారి కష్ట నష్టములను తానే స్వయముగా పరిశీలించి వారికి చేతనైనంతటి సహాయము చేయు ఉదార స్వభావము గలవాడగుటవలన ఆ పట్టణ ప్రజలు ఆతనిని దైవముగా కొలుచుచుండిరి. అట్టి సుగుణాత్ముని భార్య పేరు జవికినాదేవి. ఆమె పరమ పతివ్రతాశిరోమణియై దైవభక్తి కలిగి చిన్న పెద్దలయందు గౌరవము చూపుతూ సిద్ధ సాధులను బీద బ్రాహ్మణులను తగు రీతిగా సత్కరించుచుండెడిది. ఆ మహారాణి బీద సాదల కష్టములనెఱింగి వారికి చేతనైనంతటి సహాయము చేయునట్టి సాధ్వీమణిగా ప్రజల ప్రశంసలు నందుకొనుచుండెను. ఇట్లుండ వారికి వివాహమైన పండ్రెండు సంవత్సరములకు దేశాటనము చేయవలయునని సంకల్పము కలిగెను. అందువలన వారు రాజ్య భారమంతయు మంత్రి

యగు విజయవర్మకు అప్పగించి దేశమందలి పుణ్యక్షేత్రములను దర్శించ కాంక్షించు చుండిరి. వారి రాజ్యమునందు గూడ అనేకమగు సత్రములు దేవాలయములు కట్టించి చెరువులు బావులు త్రవ్వించి బాటసారులకు త్రోవ కిరుప్రక్కల చెట్లు నాటించి ప్రజల మన్ననకు పాత్రులై అనేకమగు పుణ్యకార్యములను చేయుచూ రాజ్యకాంక్షయందున్న ఆశ వదలి దైవారాధనలు ఒనర్చుచు ప్రజలకు సేవ చేయుచు కాలము గడుపుచుండినను వారికి మాత్రము వంశోద్ధారణార్థమై ఒక్క సంతానము కూడ లేనందున చింతజెందు చుండిరి. వారిపై భగవంతుడు కనికరించలేదు. అయినను వారు వారి ఇష్టదైవంబగు మహావిష్ణువును ప్రతిరోజు ఆరాధించుచుండిరి. ఇట్లుండ ఒకనాడు జవికినాదేవి స్వప్నమున ఒక వృద్ధ బ్రాహ్మణుడు నొసట నామంబులు నిడుకొని కనబడి అమ్మా! నీవు చింతించుట నాకు తెలియును. కాని ప్రయోజనములేదు నీవు ఎన్ని పుణ్యకార్యములు చేసినగాని ఎన్ని క్షేత్రములు దర్శించినను ఫలితంలేదు. అది ఫలించవలెనన్న ఒక్కటే మార్గము. ఏదియనగా మీరు పూర్వజన్మము నందు చేసినట్టి కర్మానుసారం వలన ఈ జన్మమందు సంతానప్రాప్తి లేక బాధపడుచున్నారు. అందులకు సృష్టిలయకారకురాలగు ఆదిపరాశక్తియైన కాళీమాతను నిత్యము విడువక సేవించినట్లయితే మీ వంశోద్ధారణార్థమై మీ గర్భమున కొంత కాలమునకు సంతానము కలిగి సూర్యచంద్రాదులున్నంత వరకు స్థిరముగా వన్నెకెక్కునట్లు చేయగలదు" అని చెప్పి అంతర్ధానమయ్యెను.

ఆ స్వప్నమును కన్న జవికినాదేవి దిగ్గున మేల్కొని అటు ఇటు పారజూచి ప్రక్కన పరుండియున్న భర్తను లేపి స్వప్న విషయమంతయు మహారాజుతో విన్నవించగా ఆ వార్త విన్న మహారాజు కొంత తడవు ఆలోచించి దేవి నీవు దిగులు జెందవలదు. నీకు అగుపడి చెప్పినది ఎవరో కాదు. అతడు ఆదిమధ్యాంతరహితుడు కమల నాభుండైనట్టి సాక్షాత్తు శ్రీమన్నారాయణుండే అందువలన మనము రేపటినుండి ఆయన చెప్పిన తీరుగా జగజ్జననియైన లోకమాతను సేవించుటవలన పాప పరిహారంబునకు మోక్షమార్గమని తెలిపి ఆ మరుసటిరోజు నుండి అమ్మవారిని సేవించుటకు నిర్ణయించుకొని వారి ఇష్టదైవమైనట్టి మహావిష్ణువును అనేక విధములుగా సేవించుట మొదలిడిరి.

ఈ విధముగా జవికినాదేవి పరంధాముడగు శ్రీమన్ నారాయణుని అనేక విధములుగా సేవించుకొనుచుండగా తెల్లవారెను. ఆ రోజు ఉదయమున వారిరువురు స్నాన సంధ్యాదులొనర్చుకొని వారి ఇష్టదైవమును కొలుచుకొని దాసీ జనులను వెంటనిడుకొని పూజా ద్రవ్యములను గైకొని కాళీ అమ్మవారి ఆలయమునకు బయలుదేరి అచ్చట ధూప దీప నైవేద్యములనిచ్చి నారికేళంబు సమర్పించి తీర్థ ప్రసాదములు గైకొని కొంత తడవు అమ్మ సాన్నిధ్యమందు నిలచి స్తుతించుట మొదలిడిరి.

అమ్మా ఆదిపరాశక్తి మహామ్మాయి
సర్వ సృష్టికి మూలాధారిణి - లోక కటాక్ష
వీక్షణీ బాలోకమాతా భవానీ
మేమున్ నీయందు మనస్సుంచి నిన్ను
సేవించుచు నీ భక్తులన్ కాపాడరావే
ఓ దుర్గా సర్వ సృష్టికిన్ సర్వజీవాళికిన్
భుక్తికి మూలాధార శక్తివై
సృష్టి నడుపుచున్నట్టి ఓ మాతా
మీ బిడ్డలైనట్టి మమ్ములన్ కాపాడి
సంతానంబుల నొసంగవే
మీ పాదారవింద సేవ యొనర్చు
వారమైతిమేని మమ్మున్ చేరంబిలచి
మా యభీష్టంబుల్ తీర్చి కరుణించి
కాపాడవే - ఓ అంబా త్రిపురసుందరీ
కల్పవల్లీ - నిన్ను సేవించుటే మా భాగ్యంబు
తల్లీ నీకున్ నమస్తే, నమస్తే నమస్తే.

ఇట్లు వారు అనంతకాలము సేవించినగాని ఫలితము లేనందున మనస్సు నిలకడ లేక వెతజెందుచు మనశ్శాంతికై అరణ్యమునకు వెళ్ళి కొంత ప్రశాంతిగా వుండదలచినవారై మంత్రియగు విజయవర్మను పిలచి అతనికి రాజ్యభారమును ఒప్పించి సైన్యాధిపతియగు చంద్రసేనుని అతని వెంట కొంత సైన్యము నిడుకొని భార్య భర్తలిరువురు సింహాద్రి అరణ్య ప్రాంతములకు వెళ్ళి అచ్చట ప్రవహించు గరుడానదీ తీరమున వున్న మైదానమునందు నిలచి అచ్చట కొన్ని రోజులు ఉండ దలచిన వారై స్థావరములను అప్పటికప్పుడే నిర్మించ ప్రయత్నము చేయుట మొదలిడిరి. మరియు అచ్చట ఉన్న వింతలను దర్శించుచూ సంతోషముతో ఆ ప్రాంతమంతయు తిరగగా, సూర్యుడు అస్తమింప వారందరు ఆ రాత్రి భోజనాదులొనర్చి అచ్చటనే బసచేసిరి.

ఆ మరుసటి రోజు ఉదయమున లేచి స్నానాదులు ముగించి, రాజు యొద్దకు వచ్చి నిలచిరి. అంతట మహారాజు తాను స్నానసంధ్య లొనర్చుకొని భగవంతుని పూజ చేసుకొని స్థావరము ముందుకు వచ్చి ఆ సైనికులను చూచి సైన్యాధిపతియగు చంద్రసేనునితో చంద్రసేనా! మనము ఇచ్చట వున్న పొద్దు గడచుట లేదు అందుకని

మనమందరము కొంతవరకు వేటాడి కాలము గడిపి వచ్చెదమని చెప్పగా అందులకు సైన్యాధిపతి సరేనని వేటకు పోవుటకు అన్నియు సిద్దపరచుకొని మహారాజును వెంట నిడుకొని విహారయాత్ర సాగించి నాల్గుదిశలు వేటాడుటకు ప్రయాణమై వెడలిరి.

ఆ రోజంతయు వినోదముగా వేటాడుచు తిరిగిరి. కాని ఒక్క జంతువు కూడ వారి కంటబడలేదు. అంతట వారు అలసటజెంది సూర్యుడు అస్తమించక మునుపే మహారాజును వెంటనిడుకొని వారి స్థావరములు చేరుకొని ఆ నాటి వేట విషయము గూర్చి ఒకరితోనొకరు చర్చించుచూ ఇంత గొప్ప అరణ్యమునందు ఒక్క జంతువు కూడ అగు పడ లేదని ఆశ్చర్యము జెంది ఈ రోజు మనము వెళ్ళిన వేళ సరిలేనందున ఒక జంతువు కూడ మన కంట పడలేదని రేపు వేకువనే లేచి వెళ్ళవలెనని నిర్ణయించుకొని రాత్రి ఎక్కువగుటచే భోజనాదులొనర్చుకొని ఆరోజు తిరిగిన అలసట వలన గాఢముగా నిద్రించిరి.

మరుసటి రోజు సైనికులందరు వేకువనే లేచి గరుడానదీ తీరమునకు వెళ్ళి స్నానంబులు చేసి సంధ్యా వందనములు తీర్చుకొని మహారాజు స్థావరము వద్దకు చేరిరి. అంతకు మునుపే మహారాజు స్నాన సంధ్యాదులు పూర్తిచేసి భగవంతుని సేవించుకొని వారు వచ్చుటకు మునుపే సర్వ సిద్ధముగా వుండెను. అప్పుడు అందరును కలుసుకొని ఈ నాటి వేటలో సాయంకాలమువరకు వచ్చుటకు వీలుండదని దూరముగా వెళ్ళవలెనని నిశ్చయించి ఆహారపదార్థంబులను సేకరించుకొని వేటాడుటకు అరణ్యములకు వెళ్ళిరి. వెళ్ళిన కొంత తడవునకు మహారాణియగు జవికినాదేవి దేవి పూజలు ముగించుకొని స్థావరము బయట వచ్చి ఆ ప్రశాంత వాతావరణమును గాంచి ముచ్చటపడి ఆ అరణ్య మున కొంత దూరము పోవలచి కొందరు దాసీలను వెంటనిడుకొని బయలుదేరెను. ఆ విధముగా అరణ్యము మధ్య వెళ్ళుచూ అచ్చటి వింతలు చూడ అనేక రకములగు వృక్ష జాతులున్న అనేక ఫలంబులతో నిండిన చెట్లుగల తోటలు చూచి ఆనందించెను. గరుడా నది, గజేంద్రనది ఈ రెండునదుల సంగమము చూడ మనోహరముగా నుండెను. ఆ నది యందు నానారకములైనట్టి చేపలున్న, మొసళ్ళున్న, తల్లి పిల్లలతో ఆటాడు దృశ్యము లున్న నానారకములైన పక్షుల కిలకిలారావములు కోకిల గానములు వినుచుండెను. అటు వంటి వినోదములను చూడ జవికినాదేవి మనస్సు గగుర్పాటుజెంది తనువు పులకరింప హా! దైవమా! ఆపత్బాంధవా! అనాధరక్షకా! నన్నేల ఈ విధముగా బాధించుచున్నావు, అనేక పాపకర్మలకు లోనైనట్టి మానవ జన్మమందు నన్ను సృష్టింపజేసి, రాజ్యభోగము నందు బంధపైచి కృశింపజేయుచున్నావే! ఇట్టి జన్మకన్నను ఈ అరణ్యమున ఒక వృక్ష ముగనో ఒక రాతిబండగనో, ఒక మృగముగనో సృష్టించియుండ చింత లేకుండనే.

ఏ పాపమున్ను యెరుగక ఈ అరణ్యమున తల్లి పిల్లలతో జీవించుటకంటే పుణ్యము వేరున్నదా అని వెత జెందుచూ సర్వేశ్వరుని వేడుకొనసాగెను.

"పరామాత్మ! నీకు నేను జేసిన అపచారమేమి? నాయందుగల నేరమేమి? నాకు చిన్నతనమున బుద్ధి వచ్చినప్పటినుండీ మీ నామస్మరణ చేయుచున్నదాననే! ఈనాడు గంధవడీ పట్టణ మహారాజు భార్యగా నున్నందున ఏమి ప్రయోజనము? అదియుగాక పట్టణ ప్రజలు నాముందు లేకున్న వెనుకనైనను మహారాణి గొడ్రాలు అని అనుకొను చున్నారు గదా! ఇట్టి నింద నేనెట్టు బాపుకొందును? ఇటువంటి పరిస్థితిలో నేను తిరిగి రాజ్యమునకు పోవుటెట్లు" అని తనకు తానే నిందించుకొని మనస్సు విరక్తి చెంది చింతా క్రాంతురాలై దాసీజనులను అచ్చటనే ఉండనిచ్చి నదీ తీరమునకు వెళ్ళి వారికంట బడ కుండా పొదలచాటున దూరి ఒక కొండపేటుపైకి దారితీసి ప్రయాణమై శరీరము అంతయు కంప ముండ్లు గీచుకపోగా రక్తసిక్తమైనట్టి శరీరమును కూడ లెక్కచేయక ఏకదీక్షతో శిఖరము పైకి చేరుకొని సర్వేశ్వరియైన ఆదిపరాశక్తిని అనేక విధములుగా స్తుతించుకొని పై నుండీ దూకి ఆత్మహత్య చేసుకోదలచెను. ఆ సమయమున అమ్మవారు గ్రహించి అయ్యో! ఈమెతో పాటు వీరి దాసీజనులుకూడ భర్తలను బిడ్డలను వదలి కడుపుకూటికి వీరి చెంతకు చేరి వున్నారే! పెద్దవారు చేయు పొరపాట్లుకు యేమియు తెలియని అమాయక దాసీలకు మరణము తప్పదని ఆ ముప్పును తప్పింపదలచెను. అంతట జవికినాదేవి శిఖరముపై నుండి ప్రవాహములోకి దూకెను. అమ్మవారి ప్రభావముచే జవికినాదేవికి ఏమియు హాని కలుగనివ్వక తన హస్తములతో పట్టుకొని రక్షించెను. అప్పటికి అరణ్యం నందు గల దాసీజనంబులు జవికినాదేవి ఎంతవరకు రానందున దిగులొంది ఆ చుట్టు ప్రక్కల ప్రదేశమంతయు వెదకిరి రాణి అగుపడ లేదు. "ఇక మనము మహారాజు చెంతకు పోయిన శిరశ్ఛేదము తప్పదని" యెంచి వారి చెంతకు వెళ్ళుటకంటె ఇక్కడనే మరణించుట శ్రేయస్కరమని యెంచి దుఃఖించుచు నదీప్రవాహములో పడి మరణించు టకు ఉద్యుక్తులైరి.

జవికినాదేవిని తన రెండు హస్తములతో పట్టిన అమ్మవారు దాసీజనులకు కన బడక ఒక్కచోట ఉంచి ప్రవాహములో పడబోతున్న దాసీజనుల చెంతకు వృద్ధురాలి రూపమున వెళ్ళి అమ్మలారా మీరు ఎవరు? ఎందులకు ఈ అరణ్యమందు సంచరిచు చున్నారు? అని ప్రశ్నించగా అందు వారు ఆశ్చర్యము జెంది ఈ ఘోర అరణ్యమందు వృద్ధురాలు యెచ్చటనుండి వచ్చెనో యని ఆశ్చర్యముజెంది "అవ్వా! మాది గందవడీ పట్టణము దాసీలమైన మేము మహారాణితో కూడ అరణ్య విహారమునకు వచ్చి విశ్రాంతి

కని ఇటురాగా ఆమె మమ్ములను విడచి అరణ్యమున ఎచ్చటికో పోయినది. ఆమె కన బడనందున మేము వెదకుచున్నాము" అని వారు అవ్వతో చెప్పగా అందులకు అవ్వ వారి మాటలు విని నవ్వగా అదిగని వారు ఆశ్చర్యపడి "అవ్వా నీవు నవ్వుటకు కారణ మేమి? నీకు మా రాణి అగుపడినదా? యని దీనాలాపంబుల వేడుకొనగా అవ్వ రూప ములోయున్న అమ్మవారు జాలిపడి "ఓ పిచ్చితల్లులారా మీరు వచ్చుమార్గమున గల జువ్వి వృక్షము ప్రక్కన గల పొదల చాటున మీ రాణి పడియున్నది పోయి చూడుడు" అని చెప్పి అంతర్ధానమయ్యెను.

అవ్వ మాటలు విన్నట్టి దాసీజనులు పరుగున వెళ్ళి చూడగా జవికినాదేవి స్పృహ తప్పి పడి వుండెను. అది గాంచిన వారు భయభ్రాంతులై ఏమి చేయుటకు దిక్కుతోచక మహారాణిని ఒడిలో పరుండబెట్టుకొని గాలి వచ్చునట్లు విసురుతూ ముఖముపై నీరు చల్లిరి కొంత తడవునకు జవికినాదేవికి స్పృహరాగా పైకి లేచి ఇటు అటు పారజూచి ఆశ్చర్యము జెంది దాసీలవంక జూచి ఇదేమి ఇప్పుడు నేనెక్కడ వున్నాను? నన్ను ఇచ్చటికి చేర్చినదెవరని ఆతురతతో అడిగెను. అంతట వారు ఆమె జాడ తెలిపిన అవ్వను గూర్చి వివరించిరి. ఆ వార్త విన్నట్టి జవికినాదేవికి శరీరమంతయు పులకరించి ఎవ్వరు ఆయవ్వ? ఆమెను చూపుడని వారినడుగ వారును ఆ పరిసర ప్రాంతమంతయు వెదకగా అవ్వజాడ కానరక పోయెను. అంత జవికినాదేవి ఆలోచించి నా గండమును కాపాడినట్టిది అవ్వ కాదు. ఆమె ఆదిపరాశక్తియైన కాళీమాతయని యెంచి వీరందరికి కనబడి తన కంటికి కనబడలేదని చింతా క్రాంతురాలై ఇక ఇక్కడే ఉన్న మహారాజు వేటలాడిన స్థావరముల చెంతకువచ్చియుండిన ప్రమాదము జరుగుననియెంచి సూర్యుడు అస్తమించకమునుపే త్వరితముగా స్థావరముల చెంతకు వెళ్ళిరి. అంతవరకును వేటకు వెళ్ళినవారు రానందున వారికి గుండె నిబ్బరమాయెను.

వేటకు పోయిన మహారాజున్ను అతని అనుచరులు ఘోరమైనట్టి అడవులు, కొండలు కోనలు అంతయు తిరిగినను ఒక్క జంతువుగానీ పక్షిగానీ మృగముగానీ వారి కంటపడక నిరాశపరులై ఆ రోజున్నూ వేళా విశేషము సరిలేదని ఒకారితో నొకరు చెప్పుకొని అందరును మహారాజు చెంతకు చేరిరి. అతడుగూడ ఇంతటి అరణ్యమున ఒక్క జంతువు కూడా కనబడనందున ఆశ్చర్యము జెంది అతని సైన్యమును వెంట నిడుకొని చీకటి పడుసరికి వారి స్థావరముల వద్దకు చేరిరి.

ఆ రాత్రి మహారాణియగు జవికినాదేవికి ఆ రోజు పడినట్టి బాధలు గుర్తుకు తెచ్చుకొని ఆమెను కాపాడుటకు అవ్వరూపమున వచ్చినట్టి అమ్మవారిమాట జ్ఞాపకము

తెచ్చుకొని నిద్రి పట్టనందున మహారాజు చెంతకూర్చుని ఆనాటి వేట విషయము సంభాషింపసాగెను. అందులకు మహారాజు భార్యనుచూచి 'మేము రెండురోజులుగా ఆ ఘోరారణ్యమునంతయు గాలించినగానీ దేవీ! మేము వెళ్ళిన వేళా విశేషమేమోగాని రెండు రోజులుగాకూడ యే ఒక్క జంతువు మాకంటబడలేద'ని అచ్చట జరిగిన వింత లన్నియు సవిస్తారముగా చెప్పెను.

ఆ వార్తలు విన్నట్టి మహారాణి భర్తచేత ప్రిమాణము చేయించుకొని ఆ రోజు భర్తకు తెలియకుండా అరణ్య సంచారముచేసి అచ్చట పడిన బాధలు, పరాశక్తి ఆమెను అవ్వరూపమున వచ్చి రక్షించిన విషయము అంతయు పూసగుర్చిచ్చినట్టు తెల్పగా ఆ వార్త విన్న మహారాజు ఆమెను యేమి యనక ఓదార్చి 'దేవీ నీవు యేల చింతించెదవు? మనము యెంత చింతించినా యేమి ఫలము? మన కర్మాను సారముగా అన్నియు జరుగునేకాని మరే విధముగా నెరవేరదని ఎవ్వరికి నీ ఫలముగానీ, సంతానముగానీ ఆనాడు బ్రిహ్మ వ్రాసియున్న ప్రికారము జరుగును. కావున మన ఇష్టదైవమగు సర్వేశ్వరుండగు కమలనాథుడు నీ స్వప్నమున చెప్పిన రీతిగా కొంతకాలమునకైనను జరిగితీరును. గాన నీవు దిగులు చెందకుము. అట్టి ఘోర అరణ్యమందు నరసంచారం లేనట్టి ప్రిదేశమున నీ యొక్క ఆత్మ త్యాగామునుండి కాపాడినట్టి ముసలి అవ్వ సామాన్యురాలు కాదు. ఆ తల్లి నీ ప్రాణములకు అడ్డువచ్చి నిలచిన జగజ్జననియైనట్టి ఆదిపరాశక్తి' అని చెప్పగా ఆ మాటలు విన్న జవికినాదేవి ఆనందభరితురాలయ్యెను.

సైనికులు మూడవరోజునగూడ వేకువజామునందే లేచి దిన కృత్యంబులు దీర్చుకొని మహారాజు చెంతకు చేరిరి. అంతట మహారాజు స్నానమాచరించుకొని సంధ్యా జపములొనర్చి ఆపద్బాంధవుడగు వైకుంఠవాసుని సేవించి ఆదిపరాశక్తియగు అమ్మవారిని స్తుతించుటకై అన్నీ సమకూర్చుకొని అతని అనుచరుల చెంతకుచేరి వారిని చూచి 'నాయనలారా మనము ఇచ్చటికి వచ్చి ఐదురోజులైనది మొదలు రెండురోజులు స్థావరములు వద్దనే యుంటిమి. ఈ రెండురోజులు వేటకు కుతూహలముతో పోగా వేట విఫలమైనది. అందుచే మనము ఈనాడు ఆఖరిసారిగా పడమట దిశకు వెళ్ళి మధ్యాహ్నమువరకు పరిశీలించి యేమైన జంతుజాలములు ఉన్నయెడల వేటాడెదము లేనియెడల తిరిగివచ్చి మన రాజ్యము చేరుకొందుమని తీర్మానించుకొని బయలుదేరిరి.

అచ్చటనుండి మహారాజు సైనికులను వెంటనిడుకొని పడమటి కోనలకు ప్రయాణము సాగించెను పోను పోనూ వారికి కొంత దూరమున అంధకారమైనట్టి కోన అగుపడెను. దానిపేరు తిమిరారణ్యము ఆ కోనవద్దకు వెళ్ళి ఆ ప్రాంతం యావత్తు పరికించి

చూచినప్పటికే మిట్టమధ్యాహ్నము కావచ్చుచుండెను. అంతట వారందరు ఈ రోజు కూడా విఫలమైనదని బాధపడి దప్పి అధికమగుటచే దప్పి తీర్చుకొనుటకు నదీతీరమునకు వెళ్ళుచుండిరి. ఆ ప్రాంతమునందున్న చెట్ల పొదలనుండి కొండగుహలనుండి అనేక మృగములు దాహమునకు గుంపులు గుంపులుగా వచ్చుట అల్లంతదూరమునగల నది గట్టుపైనున్న సైనికులు గమనించిరి. మహారాజు చెంతకు వెళ్ళి ఆ విషయము వివరించగా మహారాజు అమితానంద భరితుడై సంతోషముతో ఇక ఆలస్యము చేయకూడదని యెంచి అతని అనుచరులను ఆయుధములు సిద్ధపరుచుకొని వెళ్ళుడని ఆజ్ఞాపించి తానుకూడ వేరొకవైపు బయలుదేరెను. అప్పుడే కంటబడ్డ మృగ సమూహములను చూచి సైనికులు ఉత్సాహవంతులై వాటిపైబడి వారి కంటబడిన మృగముల గుంపును. సంహరించ మొదలిడిరి. ఈ విధముగా అనేక మృగములను హతమార్చి ఆ అరణ్యామంతయు భీభత్సవము కలిగించిరి. ఆ ప్రదేశమంతయు రక్తమయమైపోయెను.

అట్టి సమయమున అందులో చావుదెబ్బలకు గురియైనట్టి కొన్ని మృగములు నేత్రములుపోయి నడుములు లేక కాళ్ళు తెగిపోయి అనేక రకములుగా శరీరమంతనూ గాయాలతో రక్తము కార్చుకొనుచూ వారికంట కనబడక పొదల చాటుగా తప్పించుకొని అచ్చటికి సమీపమునగల కావేటికోన గుట్ట ప్రక్కన మామిడి వనముకు పడమటి దిశయందు గల దైవ నిర్మితంబైనట్టి ఏనుగెత్తున్న కన్యకల పుట్ట చెంతకు వెళ్ళి ఆ బాధను భరించుకొనలేక స్పృహ తప్పి విల విలలాడుచు పుట్టపై వాలెను.

పుట్టపై పడివున్నట్టి నోరులేని ఆ అడవి మృగములు స్పృహ నుండి కోలుకొని శరీర మంతయు గాయములచే నిండి బాధపడునట్టి జంతుజాలములు నడువను శక్తిలేక వాటి నాలుకలతో ఒకదానినొకటి తుడుచుకొనుచు వాటి బాషతో సైగలు చేసికొనుచు కంట నీరు పెట్టుకొని దుఃఖించుట మొదలిడగా వాటి కన్నీటి బిందువులు వర్షమువలె వెడలి పుట్ట రంధ్రముగుండా నాగలోకమున తపోనిష్టలోనున్న అమ్మవారి శిరస్సుపై బడెను. అదికని అమ్మవారు కోపోద్రిక్తురాలై విశ్వవ్యాప్తమైన నేత్రముల నుండి గంభీర రూపతో శిరస్సునెత్తి గగనము పైకి చూడ మబ్బులు వురుములు మెరుపులు ఏవియు కనబడలేదు. అందులకు ఆశ్చర్యపడి యోగదృష్టితో చూడగా అరణ్యము నందు వేటలో చావు దెబ్బలు తగిలి శరీర బాధలకు తట్టుకొనలేక ఎక్కడికి పోను దిక్కుతోచక ఆదిపరాశక్తి అయిన అమ్మవారిని వేడుకొనుచూ దుఃఖించుచు పుట్టపై విలపించుచు జంతువులు కనబడెను.

ఆ దృశ్యమును చూచిన అమ్మవారు జాలిపడి వీటిని ఈ విధముగా బాధపెట్టినట్టి వారిని మన్నింపరాదని యెంచి వాటి చెంతకుపోయి వాటిని ఓదార్చునెంచి ఆ విషయము

చెల్లెండ్రకు చెప్పదలచి పిలిపించెను వారిలో గుడియమ్మ, మారెమ్మ, నడివీధిగంగమ్మ పొప్పులమ్మ దూముగంగమ్మ, పాలేటమ్మ, దండుమారెమ్మ వీరి ఆరుగురిని చెంతకు పిలిచి అమ్మలారా నేను మిమ్ములను రప్పించిన కారణమేమనగా మనము ఇచ్చటికి చేరినప్పటి నుండి సృష్టించిన సర్వ జీవజంతువుల భుక్తికి ఏలాంటి లోటు రానీయక ఆహారము నొసగి కాపాడుచున్నాము. అవి మనలను నమ్మి ఈ అరణ్యమున స్వేచ్ఛగా సంచరించుచున్నవి. ఈరోజు గంధవడీ పట్టణ పరిపాలకుడు గిరి మహారాజు తన సైన్యముతో వచ్చి అనేక మృగములను వేటాడెను, అందులో కొన్ని చావుదెబ్బలు తగిలి ప్రాణావస్థతో ఎచ్చటికిపోను దిక్కుతోచక మనస్థావరమగు పుట్టపైన చేరి గోడు గోడున దుఃఖించుచున్నవి. అందువలన నేను అచ్చటికి వెళ్ళి వాటిని రక్షించి వచ్చెదను. అంత వరకు మీరు నిర్భయముగా మీ మీపనులలో ఉండవలెనని చెప్పి వారిని పంపి నాగ లోకము నుండి సూక్ష్మరూపముతో పుట్టపైకి వచ్చి నిలచెను.

పుట్ట ప్రదేశమున పడియున్న నోరు లేనట్టి జంతుజాలము ఆ విచిత్ర రూపము చూచి భీతిజెంది గడగడ వణకుచు ఎటు పోను దిక్కుతోచక అటు ఇటు తిరుగసాగెను. అది గాంచిన అమ్మవారు వాటిని ఓదార్చి ధైర్యము చెప్పి తనయొక్క ముప్పదిమూడు అభయ హస్తములతో వాటిని సజీవముగా పైకి లేపి విచిత్రరూపమును విరమించి ఏడు సంవత్సరముల బాలికవలె వాటికి కనబడెను స్వస్థత నొందిన ఆ మృగములు పైకి లేచి శరీర బాధలు అప్పటికే కనబడనందున అమితానందము పొంది ఒకదానిని నొకటి పరికించి చూచి తగిలిన గాయముల జాడ ఏ మాత్రము తెలియదాయెను. అ సగ్నంతను జంతుజాలములు ఆశ్చర్యపడి ఇట్లు మనకు ప్రాణదానం చేసిన దేవత ఎవరని ఆలోచించి ఇటు అటు పారజూడగా వాటి ఎదుట ఏడు సంవత్సరముల బాలిక కనపడెను. ఆ బాలికను గాంచిన అడవి మృగములు ఈమె బాలిక కాదని యెంచి సర్వేశ్వరి యైనట్టి ఆదిపరాశక్తియని గుర్తించి అమ్మవారి పాదముల చెంతకు చేరి మోకరిల్లి ప్రణామము చేయ అది చూచిన అమ్మవారు వాటితో ఇకమీందట మీరు ఈ అరణ్యమున ఏ భయము లేక నిర్భయముగా కాలము గడుపుడు మీకు నేను ఉన్నంతవరకును ఏ ఆపదలు రావని చెప్పి వాటిని ఓదార్చెను.

ఆ వార్త విన్న జంతుజాలములు అమితానందముతో కన్నులవెంట ఆనంద భాష్పములను వదలచూ తమ మూపు పైన బాలికను కూర్చుండబెట్టుకొని వినోదముగా ఆ ప్రదేశమంతయు ఆటలాడసాగెను. అమ్మ వాటి సంతోషమును చూచి వాటినంతయు ఒక సమూహము చేసి ఆ మృగములను హింసపెట్టినట్టి గంధవడిరాజు అతని అనుచరులను గర్వమణచదలచి అచ్చట నుండి ఆమడదూరమున నున్న వారి స్థావరముల చెంతకు

బయలుదేరెను. ఒక గజముపై నున్న అంబారిలో బాలిక రూపములో ఉన్న అమ్మ-వారు కూర్చుండి వాటితో గూడి అరణ్యమార్గమున పోవు చుండగా వెంట వచ్చునట్టి మృగములు కఠోరస్వరములతో అరణ్యము దద్దరిల్లు లాగున ఘీంకారములు చేయుచూ గిరిమహారాజు స్థావరముల చెంతకు సమీపించినది.

అట్టి సమయంబున మహారాజు అతని భార్య ఇరువురును గుడారము లోపల కూర్చుని వినోదముగా కాలక్షేపము చేయుచుండిరి. స్థావరము చుట్టూ కావలి వున్నట్టి అతని సైనికులు ఆ శబ్దములను విని నలుదిశలు పరిశీలించి పడమటి దిశగా పారజూడ ఏమియు కనబడక మృగముల శబ్దములు మాత్రము భయంకరముగా వినవచ్చుచుండెను ఆ శబ్దమును విని భీతిజెందిన కొందరు ఎత్తయినట్టి వృక్షముల నెగబ్రాకి పైనుండిచూడ వారికి అర్ధ ఆమడ దూరమునుండి పెద్ద అడవి మృగముల సమూహము వారి స్థావరముల మార్గమువైపు వచ్చుట కానయ్యెను. ఆ గుంపు ఇచ్చటికే వచ్చుచున్నదని యెరింగిన సైనికులు ఆ వార్తను మహారాజుకు తెలియజేసిరి. ఆ వార్త విన్నట్టి మహారాజు భయభ్రాంతుడై దిగ్గున లేచి ఆ ఘీంకార శబ్దములను విని ఏమి చేయుటకు దిక్కు-తోచక ఆ వార్తను భార్యకు నెఱింగించి ఆమెతో "మహారాణి ఇంతటితో మనము మన అనుచరుణ ఆ అడవి మృగముల నోటబడి ప్రాణములను పోగొట్టుకొను సమయము ఆసన్నమైనది. మన స్థావరముల వద్దకు మృగములు సమీపించుచున్నవని" చెప్పగా ఆ వార్త విన్న జవికినాదేవి భర్తకు ధైర్యముచెప్పి మీకును మీ అనుచరులకు యే హాని జరుగదని చెప్పి అచ్చట నుండి కొంతదూరాము నందు ఒక నిర్మల ప్రదేశమునకు వెళ్ళి అమ్మవారిని ప్రార్థింపదొడెంగెను.

రాజరాజేశ్వరీ - రాజీవగంధీయో
జగదంబ - పద్మోద్భవ ముఖ్య
సురనికరార్చిత - శుభకర విమల
చరణాద్వయీా - భక్తజనవాంచితార్థ
దాయకీ దుష్టసం - హారిణి నాయందు
తప్పులెన్నక - కృపజూచి
కానవమ్మా - మాకు గతి నీవే తల్లి భావింతు
నిను సదా - పరగ నామదిన్

అని అనేక విధములుగా ధ్యానించు సమయమున ఘోర మృగములు సమీపించుచుండెను. కానీ జవికినాదేవి అమ్మవారికి స్మరించుట మాత్రము విడువలేదు.

అంబా సర్వ సర్వేశ్వరీ
లోక కటాక్ష వీక్షణీ-భూలోకమాతా
దుష్టభయంకరీ -ఆది పరాశక్తి
అనేక వత్సరంబుల-నిన్ను సేవించి
ఈ అరణ్యంబున్-చేరినే డిట్టి ఘోరాతి
ఘోర మృగంబుల-నోటన్
బడనీయక-మా ప్రాణంబులన్
రక్షించి-మాయభీష్టంబులన్ తీర్చవే
అంబా జగదంబా కాపాడవే తల్లీ
నీ పాదంబులే గత్యంతరం
బని నమ్మి-నిన్నుస్తుతించి వేడు
మమ్మున్ గాపాడరావే లోక మాతా
అంబా-జగజ్జననీ ఈశ్వరీ
ఓ ఆది పరాశక్తి-కాళీ మాతా
నీకున్ సాష్టాంగ దండప్రమాణం
బుచేసి వేడెదనే భక్తులన్
కాపాడి సర్వజీవులకున్ తల్లినీ
వు గదమ్మా అంబా నిన్నే నమ్మితి నమ్మ
మమ్మున్ దీవించి కాపా
డు గదమ్మ ఓ కల్పవల్లీ నీకున్
నమస్తే నమస్తే నమః

ఈ విధముగా జవికినాదేవి అమ్మవారిని అనేక విధములుగా ధ్యానించుచు మౌనముగా కూర్చుండెను. ఆ మొర ఆలకించి కరుణించినట్టి జగజ్జనని వెంటనే ఆ జంతు జాలములను వెనుకకు మరల్చెను. అవి యన్నియు పడమటికోనలవైపుకు మరలి పోవుచుండగా మహారాజు అనుచరులు చూచిరి. మరియు మృగముల సమూహాము మధ్య ఒక వింత దృశ్యము కనబడినది. అడవి మృగముల గుంపుమధ్య ఒక ఏనుగుపైన ఏడు సంవత్సరముల బాలిక కూర్చునియుండుట కనుగొనిరి. అట్టి దృశ్యమును కన్నట్టి సైని కులు ఆ వార్త గిరి మహారాజునకు నెఱింగింపగా ఆతడును అచ్చటనుండి లేచి వారి వెంట పొదలచాటున వెళ్ళి ప్రక్కచాటుగా పోయి ఎత్తయిన ప్రదేశము నుండి పొంచి చూడ వారు చెప్పిన విధముగనే బాలిక అగుపించెను.

ఆ బాలికను చూడగనే రాజునకు శరీరము పులకరించినది. ఆ బిడ్డయొక్క ముఖారవిందము దివ్య రమణీయ తేజము కోటి సూర్యప్రకాశముగా గోచరించినది. మీనములవంటి కన్నులున్న తుమ్మెద నడుమును కలిగి దైవ సంభూతురాలైనట్టి ఆ బాలిక జంతుసమూహమునందు అటు ఇటు తిరుగుచుండగా చూడముచ్చటాయెను. గిరి మహారాజు ఆ బిడ్డ సౌందర్యమునకును ఆ చేష్టలు చూచి ముగ్ధుడై ఆ బిడ్డను తీసుకొన రాదలచి పట్టుబట్టి ఆ క్రూర మృగముల చెంతకు పోవుటకు ధైర్యము లేక విచారించుచూ కూర్చుండెను.

అంత మహారాణి జవికినాదేవి మహారాజు ఎంతవరకును రానందున ఏమైనా ఆపద జరిగినదేమోనని భయపడి కొందరు సైనికులను వెంటనిడుకొని అరణ్యమునందున్నట్టి మహారాజు చెంతకువెళ్ళి ఆలస్యమునకు కారణంబేమియని అడుగ అందులకు మహారాజు ఆ జంతుసమూహము మధ్యన ఉన్న బాలికను చూపించెను. ఆ బిడ్డను చూచిన మహారాణి మనస్సుగూడ పులకరించి నివ్వెరపోయెను కొంతతడవు ఆ బాలిక ముఖారవింద దివ్య తేజస్సును మృగ సమూహము మధ్య తిరుగాడునట్టి ఆ బాలిక చిలిపి చేష్టలను చూచి ముచ్చటపడి బిడ్డపైగల మమకారముకొద్ది ఆ బిడ్డను తీసుకొని పోవలెనని నిశ్చయించి పట్టి అప్పగించవలసినదిగా మహారాజును అనేక విధములుగా ప్రార్థించెను. ఇవ్విధముగా వారిరువురు చింతాక్రాంతులై యేమి చేయుటకు దిక్కు తోచక ఒక చెట్టుకింద కూర్చుండిరి. అత్తరి అతని అనుచరులు రాజుచెంతకు వెళ్ళిరి. వారిని చూచి రాజు సైనికులారా మనము యే విధముగా ఆలోచించినను ఆ క్రూర మృగముల సమూహమున ఉన్న బాలికను తెచ్చుట కష్టతరంబేగాని సుసాధ్యముకాదు. కనుక మీకు తోచిన ఉపాయమున్నచో తెల్పుడని వారిని హెచ్చరించెను. అందులకు వారు కొంత తడవు ఆలోచించి రాజుతో 'మహాప్రభూ మేమొక్క ఉపాయము చెప్పెదము. అది మీకు సమ్మతంబైనచో ఆ విధముగా చేయుట మంచిదని చెప్పగా వారి మాటలు విన్న మహారాజు అది యేమి ఉపాయమని వారిని ప్రశ్నించెను.

అప్పుడు వారు మహారాజా! మన అరణ్యమునకు సంబంధించి మనకు ఎదురుగా కనబడు మూడవ కోనపేరు "చీకటికోన" ఆ కోన ప్రాంతమునందు అనేక కోయ గూడెములు గలవు అందుగల కోయజాతివారు అరణ్యములందు సంచారము చేయుచూ ఎటువంటి క్రూరమృగములనైనను లెక్కచేయక ప్రాణములపై ఆశవదలి వేటాడి జీవనము గడుపుచుందురు. అదియుగాక వారిలో భూతవైద్యులు సైతం ఉన్నారు. వారిని ఆశ్రయించిన యే విధము చేతనైనను సాధించగలరని చెప్పిరి.

ఆ మాటలు విన్నట్టి మహారాజు కొంత తడవు ఆలోచించి ప్రక్కన వున్న చంద్రసేనుడి అభిప్రాయమడుగగా అందులకు అతడు వారి ఆలోచన బాగున్నదని చెప్పెను అంతట మహారాజు వారు చెప్పిన విధముగా సైనికులను పిలచి అప్పటికప్పుడే చీకటి కోనల వద్దకు పంపెను, అంత వారును అశ్వంబులనెక్కి వాయువేగముల కొండ కోనల వెంబడి బయలుదేరి వెళ్ళిరి. కొండకోనలు దాటుతూ రెండవకోనకు వెళ్ళునప్పటికి సూర్యుడు అస్తమించి చీకటి పడసాగెను. అప్పుడు వారికి ఏమార్గమును పోవుటకు దిక్కుతోచక ఈ రాత్రికి ఇచ్చట ఉండిన ఏ క్రూరమృగముల నోట పడెదమేమోనని భీతిజెంది ఎత్తయిన వృక్షములనెక్కి కూర్చొండిరి. అందులో ఒక్కడు ఇప్పటి గండము కడతేర్చువారెవరని ఆలోచించి అమ్మవారిసేవ చేయువారగుటవలన చెట్టుపై కూర్చుని అమ్మవారిని ఈ విధముగా వేడుకొనసాగెను.

ఓ విశ్వజననీ లోకైకమాతా
శాంభవీ ఆదిశక్తి - సృష్టికి మూ
లాధారిణి పరభయంకరా కారిణే
పదునాల్గు లోకంబులు నీయందు
లీనమైనట్టి ఓ శక్తిస్వరూపిణీ
ఇట్టి ఘోరారణ్య మందునన్
అంధకారంబునన్ బడవైచి యెం
దు బోవను మార్గంబు లేకుండ
క్రూర మృగంబుల నోట బడనియ్యకమ్మ
భార్యబిడ్డల చెంత మమ్ము చేర్చవమ్మ
భారంబు నీదేమాతా
నిరతంబు నీ పాదారవింద సేవలొనర్చు
వాడమైతేమేని మా ప్రాణంబుల
గాపాడి మమ్మాదు కోవమ్మ
దయాశీలి భక్తజన చింతామణీ
పురంబు చేరగనే నీ మొక్కులు
చెల్లింతు నీ ఆహార నిమిత్తంబు జీవావళి
బలులిత్తు మమ్ముకాపాడి కరుణించు ఓభవానీ
నీకున్ నమస్తే నమస్తే నమస్తే నమః

అతడు ఈ విధముగా ధ్యానించి కన్నులు తెరచి తన వెంటనున్న వానితో సంభాషించు సమయమున మబ్బులు తొలగి చంద్రకాంతి వెలుగులతో అడవి అంతయు పట్టి

పగలువలె కనబడెను. మబ్బు తొలగినందులకు సంతోషించి అటు ఇటు జూచు సమ యంబున వారికి కొంత దూరంబున మనిషి అలికిడి వినవచ్చెను. ఆ శబ్దము విని వారు భయపడి విస్తరి చూపులు చూచుకొనుచుండ పొదలచాటునుండి వెన్నెల వెలుగులోని దారి గుండా ఒక వృద్ధురాలు బెత్తము చేతబట్టుకొని వచ్చుట కనబడెను. అది చూచి వారు ఇదేమి! అర్ధరాత్రి వేళ ఈ ఘోరారణ్యము నందు వృద్ధురాలు పసిబాలికవలె వచ్చుటకు ఏమి కారణము? అది మన మృత్యువు కాదు గదా! అని దిగులు జెంది అచ్చటి నుండి పారిపోవుటకు గత్యంతరం లేక దేవిని స్తోత్రము చేయుచూ కూర్చుండిరి. శరీరం వణకు మాత్రము తగ్గలేదు అప్పుడు వృద్ధురాలు వారి చెంతకు వెళ్ళి "ఓ బిడ్డలారా మీరెందుకు ఈ ఘోర అరణ్యము నందు వృక్షములనెక్కి కూర్చుండియున్నారు కారణంబు ఏమి" అని అడుగగా ఆ మాటలు విన్న వారు ఏమి చెప్పుటకును నోట మాట రాక గడ గడ వణుకుచూ కొయ్యబొమ్మలవలె వృక్షములపై కూర్చుని యుండిరి. కొంత తడవునకు వారిలో ఒకడు అవ్వా! నీవు ఎవరు? మానవురాలై యుండిన ఇంత రాత్రి సమయంబున ఈ ప్రాంతమునకు వచ్చుటకు కారణమేమి? నీవు రాక్షసివా! లేక దయ్యమా, భూతమా అని బెదరి చెదరి మాట్లాడగా ఆ మాటలు వింటున్న వృద్ధురాలు పక్కున నవ్వి నాయనా నాది ఇక్కడికి సమీపమున గల చీకటికోనయే మా నివాసము మేము కోయవారము నా స్థావరము కొండ ప్రక్కనగల గూడెము. అదిగో ఉత్తర దిశయందు కనబడు గూడెమునందు నా బంధువుల ఇంటికి వెళ్ళి వారిని చూచుకొని వారు నిలువమన్నను నిలువక వెన్నెల కాయుచుండుట వలన మా గూడెమునకు పోవుటకు బయలుదేరి వచ్చు చున్నాను. నాకు ఈ అరణ్యము అన్న ఏ మాత్రము లెక్క లేదు. నేను చిన్నప్పటి నుండి రేయి పగలుగా పగలు రేయిగా తిరిగి భయము పోగొట్టుకొని నా బిడ్డలను కాపాడు చున్నాను. కనుక మీకు ఏమి భయము లేదు దిగిరండి అని చెప్పగా వారు ఆ మాటలు విని ధైర్యము తెచ్చుకొని వృక్షములు దిగి వారి ప్రయాణ విషయమంతయు అవ్వతో చెప్పిరి. అందులకు అవ్వ నవ్వి నేను కూడ ఆ కోనకు పోవుచున్నాను. మీరు నాతో రండు అని చెప్పి వారిని వెంటబెట్టుకొని అప్పటికప్పుడే బయలుదేరి వేకువజాము అగుసరికి గూడెము చేరి వారికి గూడెము చూపి అదృశ్యమయ్యెను. అంతట వారు ఇది ఏమి వింత ఇంతవరకు వచ్చిన అవ్వ ఇప్పటికిప్పుడే కానరాదయ్యెనని ఆశ్చర్యము జెంది ఒకరినొకరు హెచ్చరించుకొనుచూ గూడెము లోనికి వెళ్ళిరి.

వారు గూడెములోనికి వెళ్ళునరికి గూడెములోని కోయదొరలు వారి చుట్టూ మూగి మీరు ఎవరు? తెల్లవారకమునుపే ఇచ్చటికి రావడానికి కారణమేమి? మీరు శత్రువులవలె వున్నారు, మీరు రాత్రియంతయు మా గూడెము ప్రాంతము నందే సంచరించుచున్నట్టు

న్నది. నిఆఅనేక విధములుగా గద్దించి అశ్వములపైనుండి క్రిందకు దింపిరి. అంతట గిరిరాజు అనుచరులు కోయవారిని చూచి "అయ్యలారా మేము శతృవులు కాము మాది గంధవడీ పట్టణము ఆ రాజ్యపాలకుడైన గిరిమహారాజు పంపగా రెండు రోజులుగా ప్రయాసపడి ఇచ్చటికి వచ్చి చేరినాము రాత్రి అంతయు ఈ ఘోరారణ్యమున నిదుర లేక ఒక ముసలమ్మ వెంట నడచివచ్చి ఇచ్చటికి చేరినాము అని చెప్పిరి.

ఆ వార్త విన్నట్టి గూడెము నాయకుడు వారిని కూర్చుండనిచ్చి వచ్చిన విషయ మంతయు అడిగెను అంతట వారు తమ విడిసి నుండి వీరి గూడెము వరకు వచ్చి చేరిన విషయమంతయు పూసగుచ్చినట్లు తెలిపిరి. అందులకు నాయకుడు సంతోషించి మహా రాజు ఇంత దూరము పంపి నందులకు మాకు ఎంతయో సంతసము. మేము వచ్చుట గొప్పకాదు. ఆ మహారాజు వున్నంతావరకు మా గూడెమునకు ఏ ఆపదలు రానివ్వక కాపాడినాడు. మహానుభావుని మాట మీరుట భావ్యము కాదని, అప్పటికప్పుడే వారి గూడెమునందుండు సాహసవంతులను కొందరిని, భూతమంత్రి వైద్యులను వెంటనిడు కొని బయలుదేరిరి. కోయలకు వెంటనిడుకొని వచ్చు సైనికులు ఆ రాత్రి వారికి వృద్దు రాలు అగుపడి దారి చూపిన విషయము కోయవారితో చెప్పగా ఆ వార్త విన్న కోయిలు వారితో "అన్నలారా! ఆమె వృద్ధురాలు కాదు ఆమెయే అమ్మవారు. ఈ ప్రాంతమంతా తిరుగుచుండును ఎవ్వరికి ఏ ఆపదలు రానివ్వక సురక్షితంబుగా కాపాడునట్టి జగజ్జనని అయిన ఆదిపరాశక్తియగు కాళీ అమ్మవారు మీకు అగుపడినదని" ఆమె మహిమలు గిరి మహారాజు అనుచరులకు చెప్పుచూ సూర్యుడస్తమించుసరికి మహారాజున్నట్టి స్థావరముల చెంతకు చేరుకొనిరి.

మహారాజును చేరిన కోయలు అతనికి నమస్కరించి నిలచిరి. వారిని చూచినట్టి రాజు సంతోషపడి అక్కడ జరుగుచున్న విషయమంతయు చెప్పి ఆ వింత దృశ్యమును వారికి చూపెను. అది చూచినట్టి కోయలు మహారాజునకు ధైర్యము చెప్పి ఆపని రేపటి కంతయు సరిచేసి బాలికను మీకు అప్పగింతుమని మహారాజు చెంత సెలవు తీసుకొని వెళ్ళి అక్కడ చేయవలసిన ప్రయోగములన్నియు చేసి పొంచి కూర్చుని వుండిరి. అప్పుడు బాలిక రూపమునందున్న అమ్మవారు వారు చేయు కుట్రను గమనించి వారి గర్వము అణచుటకు గాను ఒక ఉపాయము పన్నెను. వారు చూచునట్లు ఆ మృగములన్నింటిని కొయ్య బొమ్మలవలె ఎక్కడివక్కడ నిలుచునట్లు చేసి తాను కూడ అదేవిధముగా ఏనుగు పైన కూర్చుండెను. కొత్త భూత మాంత్రికులు అది గమనించి వాటి చెంతకు సాహస వంతులను కొందరిని పంపిరి. వారు జంతు సమూహములోకి వెళ్ళి ఏనుగుపైనున్న

బాలికను పట్టుటకు ప్రియత్నించగా బాలికరూపములోయున్న అమ్మవారు ఆ జంతుజాలములను యధావిధిగా స్పృహ తెప్పించెను. అంతట జంతుజాలములు అక్కడ వున్న వారిని చూచి వారిని చంపుటకు వారి వెంట పడగా వారు అరణ్యమంతయు పరుగులిడిరి. స్పృహతప్పి ఎక్కడివారక్కడనే పడిపోసాగిరి. అంతట అచ్చటనే వున్నట్టి గిరి మహారాజు అతని భార్య జవికినాదేవి వారిని ఖాదించుచున్నట్టి మృగముల గుంపును చూచి మనకును ఈ గతి పట్టునేమోయని భయభ్రాంతులైరి. ఏమి చేయుటకును దిక్కుతోచని జవికినాదేవి ఏకాంత ప్రదేశమునకు వెళ్ళి నిర్మల మనస్కురాలై ఆదిపరాశక్తిని ఇట్లు స్తుతింప సాగెను.

రాజరాజేశ్వరీ-రాజీవగంధీ
యోజ గడంబు-పద్మోద్భవ ముఖ్య
సురనికరార్చిత-శుభకర విమల
చరణావ్వయీ-భక్తజన వాంచితార్థ
దాయకీ దుష్ట సంహారణి
నాయందు తప్పులెన్నక-కృప జూపి
కావవమ్మా మాకు గతి నీవే తల్లి బావింతు
విను సదా-పరగ నా మదిన్

అని అనేక విధములుగా ప్రార్థింపగా ఆ మొరాలకించినట్టి అమ్మవారు తనకు తానే పశ్చాత్తపపడి ఈ విధముగా నేను సంచరించుచుండిన వీరు నా గురించి అనేక బాధలు పడుచుందురని గ్రహించి అరణ్యము నందు వారిని వెంటాడుచున్నట్టి మృగములను చెంతకు పిలచి ఒక్కచోట చేర్చెను.

తదుపరి గుంపుగా చేరి వున్నట్టి మృగముల చెంతకు వెళ్ళి వాటిని దీవించి వాటి భాషలో ఓ జంతుజాలములారా! నేను వచ్చినప్పటినుండి ఇప్పటివరకు మీ చెంతనే మీకు ఆపదలు రానివ్వకుండా కాపాడుచున్నాను, నేనిప్పుడు నాగలోకమునకు వెళ్ళి నా చెల్లెండ్రను చూడవలెను. వారు నా గురించి ఎదురు చూచుచుందురని వాటితో చెప్పి సెలవు తీసుకొనెను ఆమృగములన్నియు బాలిక రూపములో ఉన్నట్టి అమ్మవారిని చూచి కంట నీరు బెట్టుకొనుచూ ఆమెను వెంటాడసాగెను.

వాటి బాధను గమనించిన పరాశక్తి వాటిని ఓదార్చి బిడ్డలవలె పోషించి ఈనాడు మిమ్ములను విడువను, నేను ఎచ్చట వున్నను మీకు తోడైయుండి మీ ఆపదలు కాపాడుదునని ధైర్యము చెప్పి అవి చూచుచుండగా ఏనుగెత్తుగల కన్యకోమల పుట్టలోనికి

వెళ్ళెను. ఆ సమయమున గిరిమహారాజు అనుచరులు వృక్షములపై నుండి ఆ దృశ్యమును గాంచి ఆశ్చర్యముజెంది పరుగు పరుగున వచ్చి ఆ వార్తను మహారాజున కెఱింగించిరి.

ఆ వార్త విన్నట్టి భార్యభర్తలిద్దరు ఆచ్చెరువు చెంది భయభ్రాంతులై ఆ బాలిక మనలను పరీక్షింపవచ్చినట్టి దైవసంభూతురాలగు సృష్టిలయ కారకురాలైనట్టి జగన్మాత అయి వుండవచ్చునని అట్టి తల్లిని మనము పట్టుటకు ప్రయత్నించుట తప్పు అని యెంచి ఆ అపరాధము మన్నింపమని ఆ తల్లిని వేడుకొనిరి. కొంతసేపటికి సూర్యదస్తమించెను అంతటవారు అచ్చటనుండి వారి స్థావరముల వద్దకు వెళ్ళి స్నానమొనరించి అమ్మను సేవించుటకు మొదలిడిస్తుతించిరి.

నమస్తేస్తు మహామాయే శ్రీ పీఠేసుర పూజితే.
శంఖ చక్ర గ్దా హస్తే ఆదిశక్తి-నమోస్తుతే
నమస్తే గరుడా రూఢే-డోలాసుర భయంకరీ
సర్వపాప హరే దేవీ జగన్మాతా నమోస్తుతే
సర్వజ్ఞే వరదే సర్వదుష్ట భయంకరీ
సిద్ధి బుద్ధి ప్రదే దేవి భుక్తి ముక్తి ప్రదాయనీ
మంత్ర పూలే సదాదేవి-సర్వశక్తి నమోస్తుతే
అద్యంత రహితే దేవి ఆదిశక్తి మహేశ్వరీ
యోగజ్ఞే యోగసంభూతే వింద్యాచలవాసిని
స్థూల సూక్ష్మ మహారౌద్రే మహాశక్తి మహోధరీ
మహపాప హరే దేవీ త్రికాలశక్తి నమోస్తుతే
పద్మాసనస్థితే దేవీ పరబ్రహ్మ స్వరూపిణీ
పర మేశ్వరీ జగన్మాతా త్రిపురసుందరీ నమోస్తుతే
శ్వేతాంబర ధరే దేవీ నానాలంకార భూషితే
జగస్థితే జగన్మాత మహాదేవీ నమోస్తుతే

అని అనేక విధములుగా అమ్మవారిని స్తుతించి ధూప దీప నైవేద్యములనిచ్చి తీర్థప్రసాదములను సేవించి భోజనాదులొనరించి ఆ రాత్రి విశ్రమించిరి.

ఆ రాత్రి వారిరువురు గాఢముగా నిద్రించు సమయమున మహారాజుకు స్వప్నము
ు నవయవ్వన సౌందర్యవతియైనట్టి స్త్రీమూర్తి బంగారు జలతారు గజ్జల చీరకట్టి
సనముపై కూర్చుని వున్నట్లు కనబడి "మహారాజా ఈ అరణ్యమందు విశ్రాంతికై
నట్టి మీరు వేటకై వెళ్ళి ఆ బాలికను కనుగొనితీసుకొనపోవ ప్రయత్నించుచున్నారు
ఆ పని ఇప్పట్లో జరుగదు. కావున మీరు ఇక కొంత కాలము వేచి వుండినట్లయితే
క మీ వంశోద్ధరణార్థమై ఆ బాలిక మీకే దక్కునని చెప్పి అంతర్ధానమయ్యెను.'

అట్టి స్వప్నమును గన్న మహారాజు దిగ్గున మేల్కొని అటు, ఇటు పారజూడ
'య మందిరము నందు అతని భార్యతప్ప మరి యెవ్వరును అగుపడనందున ప్రక్కన
ిడిన భార్యను లేపి తాను కన్నట్టి స్వప్నమును వివరించగా ఆమె ఆ వార్త విని
దభరితురాలై మహారాజును చూచి స్వామి మీ స్వప్నము ఎప్పుడు నిజమునో
ి వరకు మనస్సుకు శాంతి లభించదని వాపోయెను. అంతట మహారాజు "దేవీ
నమున చెప్పిన రీతిగా ఆ బిడ్డ మనకు ప్రాప్తి యున్నయెడల తప్పక లభించును
నిర్ణయము ఎటులున్నదో ఆ తల్లిపై భారము వైచి ఆ పుట్టను త్రవ్వించినట్లయిన
ా ఆనవాలు ఖచ్చితముగా లభించునని యెంచి ఆ పని చేయించుటకు శుభదినము
గోరి జ్యోతిష్యులను రావించిరి.

అన్నియు పరీక్షించుచుండ అది
బి దైవనిర్మితంబైనట్టి పుట్టయని
యెడల చాలా అపాయకరమైనట్టి
ిరిరాజు యేమి చేయవలెనని వారిని

ట కొన్ని శాంతులుచేసినట్లయిన
ు అట్లు లేని యెడల ప్రాణహాని
్నవించిరి.

వాత్సల్యముతో తమ సంపదలు
ా యేమియు కొదువ లేవని యే
ు ధృఢ సంకల్పముతో అచ్చట
ప్పించుటము చెప్పుమనిరి, అప్పుడు

వారు మహారాజుతో రాజా మీకు కనబడిన బిడ్డ బాలిక కాదని, ఆమె సాక్షాత్తు జగజ్జనని అని ఆమెకు చేయవలసిన శాంతులు ఆదిపరాశక్తి యైనట్టి, కాళిమాతకు చేయు విధముగా చేయవలెను. ముఖ్యముగా ఒక్క పుట్టి బియ్యం ఒక్క పుట్టి శెనగ బేడలు, కుంబకూటికిని అర్థపుట్టి ఆరిక బియ్యం, నూట ఒక్క టెంకాయలు నూటఒక్క నిమ్మకాయలు ఒక వీశె పసుపు అదే విధముగా కుంకుమ, గందోడి, సాంబ్రాణి కర్పూరం వీటినన్నిటిని సమకూర్చి చేయవలసిన రీతిగా ఆ పుట్ట ముందుంచి అచ్చట ధూప దీప నైవేద్యములను బెట్టి నారికేళంబులను పగులకొట్టి నిమ్మపండ్లను, అక్షింతలను అచ్చటచ్చట ఆ ప్రదేశమంతయు చల్లి తదుపరి అమ్మవారికి ఆహార నిమిత్తంబు ఒక నల్లమేకపోతు, ఒక బాణ గొర్రె పెద్దదున్నపోతు ఈ మూడింటిని బలియిచ్చి ఆ రక్తం ఆరిక కూటిలో పైచి కలిపి ఆ చుట్టు చల్లించి తరువాత అచ్చట ఉన్నవారి కందరికి అన్నదానం చేయవలెను. తరువాత మీరు స్వయముగా వెళ్ళి ఆ పుట్టను త్రవ్వి పద కొండు పారల మన్ను వెనకకువేసి అటు తరువాత ఆ పనిని వడ్డిరాజులకు ఒప్పజెప్ప వలెను. వారు దానిని త్రవ్వి బొమ్మబాలిక బయటకు తీయుదురని శాస్త్రజ్ఞులు చెప్పిరి.

జ్యోతిష్యులు చెప్పిన రీతిగా రాజు అప్పటికప్పుడే అన్నియు సమకూర్చి వారి సైనికులతోపాటు పండ్రెండుగురు వడ్డి రాజులను వెంటనిడుకొని సింహాద్రి అరణ్యమందున్న చీకటికోనప్రక్కనగల గట్టు సమీపమున మామిడివనము ప్రక్కన ఏను గెత్తు ఉన్న కన్యకోమల పుట్టచెంతకువెళ్ళి ఆ చుట్టుప్రక్కల ప్రదేశమంతయు శుభ్రి పరచిరి. ఆ చుట్టు పర్వతశ్రేణులచే నలంకరింపబడి అతి మధుర ఫల, పుష్ప భరితమైనట్టి వృక్షములచే జాజి పొన్న పొగడ దేవగన్నేరు మొదలైన సుగంధ కుసుమల లతలచేతను శుకపిక మయూరాది పక్షుల సమూహముచేతనూ, తురంగ సారంగాది మృగములచే విరాజిల్లు ప్రదేశము ప్రశాంత వాతావరణముతో నొప్పారు చుండెను. ఆ కొండకోనలయందు చెట్లు పొదలు మనోహరమగు దృశ్యములతో నిబిడీకృతమైన ప్రకృతి దివ్యసందర్శనముతో సర్వకళాచైతన్య సంపదలతో ప్రకాశించుచూ కన్నులకు విందుగొలుపుచుండెను. ఏనుగెత్తుగల కన్యకలపుట్ట వారికి ఆనందమును భీతిని కల్పించుచుండెను. కొంతసేపటికి అందరు ధైర్యము తెచ్చుకొని పుట్టవద్దకు వెళ్ళి చుట్టూ బాగుగా శుభ్రపరచి అచ్చట చేయవలసినవన్నియు శాస్త్రరీతిగా జరిపి ధూపదీప నైవేద్యములనిచ్చి తెచ్చిన జీవావళిని ఆహారంబుగా బలి ఇచ్చి జ్యోతిష్యుల చెప్పిన తీరుగా మహారాజు చేయవలసిన కార్యములు జరిపి తరువాత వడ్డియరాజులకు పుట్టను త్రవ్వుటకు ఆజ్ఞాపించెను. అసాధివారిచే మూడురోజులు అమ్మ

వారి ఆగమముచెప్పించి అనేక శాంతులు చేయుచుండిరి. మహారాజు సమీపమునగల స్థావరములచెంత భక్తి శ్రద్ధలతో వేచియుండెను.

ఆనాటినుండి వడ్డియరాజులు పనిప్రారంభించి చీకటిపడుసరికి వారి స్థావరములకు వెళ్ళి తిరిగి పొద్దునకంతయు వచ్చిచూడ ముందురోజున్న పుట్ట యధావిధిగా ఉండెను కాని త్రవ్విన గుర్తు తెలియదు. అప్పుడు వారు ఆశ్చర్యపడి భీతిచెంది ఆనాటినుండి అందరు అచ్చటనేయుండి వంతులు ప్రకారము రేయింబవళ్ళు పనిచేయుట మొదలు పెట్టిరి. మండలమురోజులు యెడతెరిపి లేకుండా ప్రయత్నించగా అప్పటికి వారి నేత్రములకు పాలు, నీరు, పసుపు, కుంకుమ కలిపిన నీరు తప్ప బాలిక మాత్రము అగుపడ లేదు. అప్పుడు వారు ఇక మనము ఎన్నిరోజులు చేసినను ఫలితం శూన్యమని యెంచి ఆనాటికి పని ఆపి మహారాజుచెంతకు వెళ్ళి అచ్చట జరుగుతున్న విషయమంతయు నెఱింగించిరి. ఆ వార్త విన్న గిరి మహారాజు ఏమియు చేయుటకు దిక్కుతోచక చింతాక్రాంతుడై ఆ దృశ్యమును చూడ అచ్చటికి వెళ్ళెను.

అన్నిరోజులు చేసిన ఫలితము లేక యేమియు బహుమానము లభించని వడ్డి బోయలు చింతజెందుచు ఆ రాత్రి అచ్చటనే గాఢముగా నిదురించిరి. కొందరు మధుపానీయములు సేవించి నిదురరాక వేళాకోళములాడుచూ అరణ్యమంతయు అరుపులలో నింపుచూ కూతలు పెట్టుచుండిరి అప్పుడు వారికి ఒక వింత దృశ్యము కంటబడెను. అవి ఏమియనగా అగ్గిమెరుపులు మెరియుచు కొన్ని ఆకారములు వారి కంటబడసాగెను. ఆ వింతలు చూచినవారు భయపడి తాగిన మత్తువదలి యధాప్రకారముగానున్నను అవే వింతలు అగుపడెను. అదిచూచి వారు భయభ్రాంతులై అచ్చట పరుండియున్న వారి వందఱిని లేపి వారికిన్ని ఆ వింతలు చూపిరి అదిచూచిన కంగారుపడి వారందరు దిగులు జెంది ఎచ్చటికి పోవను దిక్కుతోచక అటు ఇటు పరుగిడ ప్రారంభించిరి. అప్పుడు వారికి ఒకవింత వార్త వినవచ్చెను.

"ఓ వడ్డిరాజులారా! నాచే సృష్టింపబడిన మానవులు మీరే. నన్ను పట్టదలచినారే మీకెంతటి గర్వమున్నది. కానీ నా గురించి యెందరో తపంబులు చేయుచున్నారు. అనేకమగు వ్రతములు చేయుచున్నారు అట్టివారికి నేను ఇంతవరకును అగుపడలేదే! ముందుయుగములందును నన్ను వశము చేసుకొనదలచినట్టి రాక్షసులను సైతము హతమార్చి వారి వంశములు లేనట్లుచేసిన ఆదిశక్తిని నేను. అట్టి శక్తిని పట్టు మీ తరమా! కనుక మీరున్ను ఈ కలియుగమందున్న యెడల ధనాపేక్ష అధికమై ఘోరమగు దుష్ట ప్రవర్తనలు చేయుదురు. అందువలన యే వడియరాజులు వంశము ఉండరాదని చెప్ప

ఆ మాటలు విన్న వడ్డిరాజులు అందరు దుఃఖించుచూ "తల్లీ ఇందు మా నేరమేమియు లేదు మేము కడుపుకూటికి ఈ పనిచేసిన వారమేగాని మీరు అచ్చట ఉండుట మేమెరుంగము. మేము మహారాజు ఆజ్ఞానుసారముగా చేసినవారమేగాని వేరొండుగాదు." అని అనేక విధములుగా వేడుకొనగా అందులకు అమ్మవారు శాంతము వహించి వారిపై జాలిపడి నప్పటికినీ వీరిని ఈవిధముగా విడచినట్లయినా యుగధర్మాను సారము వీరు కలిపురుషుని ప్రభావముచే గర్వమధాందులౌ దురని భావించి ఇట్లనెను ఓ మానవులారా ఈ నాటి నుండి మీకు రాజ మర్యాదలు తగ్గి మీలో దనవంతులు తక్కువై జీవితాంతము రేయింబవళ్ళు భూదేవినే నమ్ముకొని కష్టజీవులై ఎంత సంపాదించినను చాలక రోజు రోజుకు కష్టముచేసి తినుచూ దానికి మించి నిలుపుకోలేని జీవితములు గడుపుచూ నమ్మిన వారిని మోస పుచ్చుచూ దేశసంచారము చేయవలసినదే గానీ జీవనం జరుగుట కష్టతరమగును. అదియుగాక జనులు మీరు చేసిన కష్టమునకు మించి ఇవ్వరు. అందులకు మీరు పొరపాటు చేసిన యెడల అది మీ కష్టమే అగును. ఇతరులు నానా విధములగా మిమ్ములను దూషించినను అది పాటింపకురాదు..దీనికి మించి మీకు నిష్కృతి లేదని చెప్పగా అందులకు వారు మేము ఈవిధముగా ఎన్ని రోజులు ఒకరి కింద కష్టపడి జీవించవలెను. దీనికి "యేదైనను మార్గము తెలుపమని" వేడుకొనిరి. అప్పుడు అమ్మవారు రూపమున ఉన్న స్త్రీ ఈవిధముగా చెప్పెను. నాయనలారా మీరు ఒకరికి కష్టపడి పనిచేయుట వలనను లోకమంతయు తిరుగుట వలనను ప్రజలకు మీరు బిడ్డలే అగుదురు అట్టి బిడ్డలను ఎవరైనను మోసగించిన వారు అనేక బాధలు పడి కలిపురుషుడు తొమ్మిద్ది సంవత్సరముల వారిని విడువడు మీరు వారికి చెడ్డ తల పెట్ట నట్లయిన పదకొండు సంవత్సరములు మీకు కలిపురుషుడు తొలగడు ఇదినిజము. అదియు గాక మీ కష్టంబులు తప్పవలనన్న యెప్పటికైనను ఒక్కటే మార్గం అది ఎమంటే మీకు ఎంతటి ఐశ్వర్యమున్నను పర జాతి వారిని గౌరవించి వారిని మీ తల్లిదండ్రులవలె యెంచుకొని ప్రవర్తించి దైవపూజలు చేయుచు భగవంతుడే దిక్కు అని యెంచి తగ్గుట వలన మీకు యేనాటికైనను నేను మంచి మార్గమును చూపించెదను లేనియెడల జీవితాంతము కష్టపడవలసినదే చిన్న పెద్ద గురువు దైవము యెంచుకొని తిరిగిన యెడల మీకు అన్నివిధములుగా తోడు పడి మీ వెంట జీవితాంతము ఉండెదను. అటులేని యెడల అనేక భాదలు కలిగించెదను మరియు ఒక్కటి విషయము యేమంటే వేరు జాతివారు మిమ్ములన్ను అనావశ్యముగా చూచి మీపై అక్రమముగా ప్రవర్తించినను వారు అనేక రీతులుగా యేడు సంవత్సరముల దెబ్బిడి తోబులు కష్టములకు గురి అయ్యెదరు ఇక నుండి చెప్పిన విషయములు జ్ఞాపకముంచుకొన్న యెడల నేను మీక

ఖచ్చితముగా తోడయ్యేవనని చెప్పి అదృశ్యమయ్యెను! అనాటి నుండి వడ్డిరాజులు వడ్డిబోయులై కష్టజీవులై అందరికి బిడ్డలవలె మెలగుచున్నారు.

ఈ విషయము విన్నట్టి మహారాజు చింతాక్రాంతుడై యేమి చేయుటకు దిక్కు తోచక వారి ఇష్టదైవంబగు మహావిష్ణువు విగ్రహం చెంతచేరి "హా దైవమా! సర్వేశ్వరా! ఆపత్ బాంధవా! అనాద రక్షకా! మమ్మేల ఈవిధముగా బాధింపుచున్నావు ఇది మా పూర్వ జన్మ కర్మయా లేక ఈ జన్మ కర్మయా మా యందు యేదోషమును లేదే! అటులున్న యెడల ఇప్పటి కిప్పుడే శిక్షించినను బాధపడము, తండ్రి! మేము ఇంత వరకును పడుచున్న బాధల కెప్పుడు విముక్తి? మా యొక్క సంపదలన్నియు రాజభోగ మంతయు నీకే అర్పించితిమే! అయినను మాపై దయలేదు గదా! అ బాలిక మాకు దక్కిన చాలుననే అనేక రీతులుగా ఆదేవ దేవుని ప్రార్థించెను. తర్వాత తమ యిల వేలుపు అగు ఆదిశక్తి యైనట్టి జగజ్జననిని వేడుకొని ప్రార్థింపసాగెను.

జయజననీ పావనీ - భక్త సంరక్షణి
సత్కృపా, వీక్షణి, శ్రీవిశేష, ప్రయోదాత్త
లోకత్రియీ - మహామ్మాయి
సర్వేశ్వరీ, శర్వరీ-గాఢ జటార్ధదేహిస్థితే
సర్వదేవస్తుతే-సర్వదామౌని సంపూజితే
శైలపుత్రి-కృతాశేష-దోషక్రియా, వర్తన
సోమాన-శంకరీ, శంకరగౌరీ-కామాక్షీ
నానావిధా వజ్ర రత్నో-జ్వాలానేకనమ్భో!
షణాలంకృతాంగీ-శుభాంగీ ఉమా
దుర్గీ-కాత్యాయినీ-ఆదిశక్తి సమస్తాఘ
నిర్వాపణే దండ ముండాది రాత్రించరో
ద్దండగర్వాతి నేక కయీ యక్షమా
నంద సందాయకీ నిత్యవాంఛితి ముద్దమాకీ
నిష్కళంకాత్మికా, నీపందా బోరు
హద్వంద్య-మెంతేనియుం భక్తితో
నెంతు, పూజింతు, సేవింతునే దాసుడన్
నన్ను కారుణ్య దృష్టిన్, విలోకించి

మన్నించి, కష్టంబులన్-చింతలెల్లన్
నివారించి నాకోరికన్ దీర్చి
రక్షింపవమ్మా, నిన్ను, నమ్మినానమ్మా
యన్యుండగానమ్మా నాసంస్తుతుల్
గొమ్మా మో భద్రకాళీ నమస్తే, నమస్తే. నమస్తే.

అని దేవ దేవిని అనేక రీతులుగా వేడుకొని కంటనీరు. ఏగధారగా జాలువార స్పృహ తప్పి నేలపై వ్రాలెను.

మహారాజు స్పృహ తప్పి పడగా అతని సైనికులు అది చూచి భయకంపితులై కొయ్య బొమ్మలవలె నిర్వేర పోయి యేమి చేయను. దిక్కు తోచక వారే ఒకరి నొకరు ప్రశ్నించుకొను చుండిరి. సూర్యుడస్తమించి చీకటి పడెను. అప్పటికినీ మహారాజు స్పృహనుండీ కోలుకొనలేదు. ఆవిధముగా పడుండి యున్న మహారాజు స్వప్నమందు ఏడు సంవత్సరముల బాలిక కనబడి „ఓ మహారాజా నీవెందుకు చింతించెదవు. నీకు నేను లభ్యపడు సమయము సమీపించుచున్నది. అది కూడా ఎక్కువ కాలము అవసరము లేదు ఇప్పుడు ఎంత ప్రయాసపడినాగాని మీచేతి కందను అట్లు కాదన్న యెడల ఒకే ఒక్క మార్గమున్నది. అది ఏమనగా నీవు నిర్మల మనస్కుడవై, ఒక రోజంతయు ఉపవాసము ఉండి దీక్షతో చేయవలసిన శాంతు లొనర్చవలెను ఒక పుట్టి పాలు, పెరుగు, నూట ఒక్క టెంకాయ, నూట ఒక్క నిమ్మకాయలు నెయ్యి, తేనె, పంచదార, పసుపు, కుంకుమ, గంధోడి ఆదిగాగల కావలసిన పూజాద్రవ్యములను తెప్పించి అటు తరువాత పుట్ట వద్ద శాస్త్రోక్తముగా పూజచేసి నారికేళంబులను కొట్టి నిమ్మపండ్లు, అక్షింతలు, అక్కడక్కడ భద్రపరచుకొని తరువాత పాలు, పెరుగు నెయ్యి, తేనె, పంచదార, అరటిపండ్లు, వీటితో పంచామృతము చేసి నన్ను ధ్యానించుకొంటూ నీవే స్వయముగ పుట్టకు పాలుపోసిన యెడల మీకు తప్పక లంభించెదనని చెప్పి అంతర్థానమయ్యెను. అప్పుడు మహారాజు దిగ్గున మేల్కొని సంతోషానంద భరితుడై సర్వేశ్వరి యగు జగదాంబను అనేక విధములుగా స్తుతించి స్వప్నములో చెప్పిన రీతిగా చేయుటకు నిర్ణయించుకొని వేకువ జామున లేచి రాణి జవికినాదేవికి స్వప్న విషయమంతయు తేట తెల్లముగా తెలిపెను. ఆవార్త విన్న మహారాణి ఆనంద భరితురాలై సంతాన వ్యామోహముచే పరితపించుచు ఉన్నందున అదే విధముగా జరిపి బాలికను తీసుకొని పోవుట శ్రేయస్కరమని నిర్ణయించిరి.

అప్పుడు మహారాజు భార్యను చూచి "దేవీ! మన మిద్దరమ్ము ఇచ్చట ఉన్న

యెడల కావలసినట్టివి చేర్చువారెవరు కనుక నీవు వెళ్ళి అన్నియు సక్రమముగా సిద్ధ పరచి మన అనుచరుల వెంట పంపిన ఇచ్చటనే వుండి అన్ని కార్యములను శ్రమ రీతిని జరిపించి భద్రముగా బాలికను తీసుకొని వచ్చు యేర్పాటు చేతునని చెప్పి పంపెను. అంతట న్ఞామె మహారాజు ఆజ్ఞానుసారముగా సైనికులను వెంటనిడుకొని నిజపురము నకు వెళ్ళి అన్నియు సమకూర్చి వారిచేత పంపెను. వారి కొరకై ఎదురు చూస్తున్నట్టి మహారాజు స్నానసంధ్యాది కార్యములు నిర్వర్తించి పుట్ట చెంతకు వెళ్ళెను.

అంతట రాజు పూజా ద్రవ్యములు గైకొని చేయవలసిన తతంగములు త్వర త్వరగా జరిపించి నారికేళంబులను కొట్టి అచ్చట నిమ్మపండ్లు, అక్షింతలు జల్లి శాస్త్రీయ రీతిగా వెళ్ళి కన్యకల పుట్టకు తని పోసెను. ఆ తర్వాత కర్పూర హారతులనిచ్చి ధూప దీప నైవేద్యములనర్పించి.

ఓ ఆదిశక్తి-పరమేశ్వరీ త్రిపుర సుందరీ
త్రిలోక సంచారిణి-జగన్నేత్రీ ఆదికి
మూలకర్తవై-సృష్టికి తల్లివై నట్టి ఓ
అంబా నిన్ను వత్సరంబులు కొలిచెన్
కరుణించవే ఈనాడు మా యందు-నీదయ
తప్పెనేని నీముందు కంఠంబు తెగన్
వేసుకొందు, ఇక బ్రతుకున్న కంటె
మరణంబు. వీరస్వర్గం బగున్
అట్లు లేదేని-మాయందు దయ ఉంచి
కరుణించి-మాకిచ్చిన మాటన్ నిల్పి
మాకు సంతానంమున్ యిచ్చి మమ్ము
గాపాడుమో యంబా నీదు పాదార
విందంబులని దాల్చి నిరతంబు చేయు
వాడనైతినేని-మా ఆపదల్ తీర్చు
వే ఓకల్ప వల్లీ! ఓ జగన్మాతా!
నమస్తే, నమస్తే, నమః

ఈ విధముగా అనేక విధములుగా సేవించుచుండగా అతని మొర ఆలకించి నట్టి జగజ్జనని వారిని కనికరించెను.

అట్టి సమయంబున సృష్టిలయ కారకురాలగు సర్వేశ్వరియైనట్టి జగజ్జనని వారి బాధలను గ్రహించినదై వారికి పెట్టినట్టి పరీక్షలలో నెగ్గినందున పశ్చాత్తాప పడి మాట మేరకు సర్వేశ్వరుండగు కమలనాభుండైనట్టి వైకుంఠవాసుడు కోరి యుండుట వలనను రాజదంపతులకు తనపై ఉన్నట్టి భక్తిభావముచే ఇప్పుడు వారి ఇంట జన్మించవలెనని భావించి ఆవార్తను చెప్పుటకు చెల్లెండ్ర చెంతకు వెళ్ళెను అంతట అమ్మవారు వారిని చూచి అమ్మలారా! మనము ఇంతవరకున్ను ఎట్టి చింతయు లేక పాతాళ లోకమందు జీవించుచుంటిమి. కాని ఇప్పుడు మన మందరము కలియుగము నందు జరుగు పాపముల గూర్చి వాటిని నిర్మూలించుటకుగాను భూలోకమున అచ్చటచ్చట శక్తి రూపములు దాల్చి అక్కడ వున్న మానవులకు భక్తిమార్గము చూపి అటురాని వారిని శిక్షించుచూ తగిన మార్గము చూపుచుండవలెనని చెప్పెను.

కావున మీరు కలియుగమున అవతరించినట్లయితే నేనున్ను నా కార్యములు చక్కబెట్టుకొని కొంత కాలమునకు భూమిపై అవతరించి మీరు ఎక్కడ ఉన్నను అచ్చటికి వచ్చి మిమ్ములను కలుసుకొందును. అట్లుగాక అంతలోపల యేదైనను పనిబడిన యెడల మీరు నన్ను తలంచిన యెడల అప్పటికప్పుడే మీచెంతకు వచ్చి మీకోర్కెలు నెరవేర్తునని చెప్పి వారిని దీవించెను అంతటవారు ఆమె చెప్పిన విధముగా ధరణిపై ప్రపంచమంతటను శక్తి అవతారములు నెత్తి అచ్చటి నుండి కలియుగము చేరి వారి మహిమలు చూపెట్టిరి. కాశిలో విశాలాక్షి ను శ్రీశైలం భ్రమరాంబగను బెజవాడ కనకదుర్గమ్మగను కంచి కామాక్షమ్మగను కొల్లూరు మూకాంబికగను ఓరుగల్లు ఎల్లమ్మగన్ను అనేక నామంబులతో శక్తిరూపములలో అవతరించి అచ్చట వారి మహిమలు చూపుచున్నారు. సృష్టికంతటకిని ఆదిశక్తి ఒక్కటే మూలము. పేర్లు వేరే గానీ రూపము యొక్కటే అట్లు విశ్వవ్యాపియై ప్రపంచమంతయు వెలయుచున్నది.

తదనంతరము అమ్మవారు ఆమె చెల్లెండ్ర కోరిక మేరకు విశ్వరూపమును చూపెను. ఆరూపము చూచిన వారు ఆశ్చర్యము జెంది మన అక్క యెంతటి శక్తి వంతురాలు! ఆవిశ్వరూపములో పదునాల్గు లోకంబులు, భూమి, ఆకాశము, సప్తనదులు, సప్తదీపులు, సర్వదేవతలు అనేకమగు సృష్టియంతయు ఆమెలో నిండి నిగిడీకృతంబుగా నుండెను. ఆమెను చూచి వారు అమితానంద భరితులైరి. అప్పుడు అమ్మవారు ఏనుగెత్తు కన్యకల పుట్ట నుండి విశ్వరూపముతో ప్రత్యక్షమయ్యెను. అరణ్యమంతయు భూకంపము వలె పెళ పెళ మని దద్దరిల్ల అక్కడ వున్న మృగములు భీతిజెంది అరణ్యమంతయు భయంకర ధ్వనులు చేయుచూ ప్రాణ భయముచే అటు యిటు పరుగులిడ సాగెను.

అమ్మవారు ధరిణిపైకి వచ్చి నిలిచెను. ఆ విశ్వరూపము చూచి భరించలేక మృగములు మరియు గిరిరాజున్ను స్పృహ తప్పిపడి ఉండుట గాంచి యోగదృష్టి చూడ తానే విశ్వరూపమున పుట్ట చీల్చుకొని వచ్చి నందున ఈవిధముగ జరిగినదని యెంచి శాంతము వహించి అచ్చట పడియున్న జంతువులకు స్పృహ నుండి కోలుకొన్నట్టు చేసి ఆ పుట్ట వద్ద పడియున్నట్టి గిరిమహారాజును స్పృహ కలిగించి ఆమె ఒక బంగారు శిలా ప్రతిమగా రూపొంది మహారాజు పట్టు వస్త్రమునందు పడెను. అంతట ఆ మహారాజు అబరువు విగ్రహము పడినతోడనే భయభ్రాంతుడై దిగ్గునలేచి సంభ్రమాశ్చర్యములతో గడ గడ వణకుచు బరువుగా ఉన్న పట్టు వస్త్రము విప్పి చూడ అందులో బంగారు ప్రతిమ కంబడెను. అది చూచిన మహారాజు అమితానంద భరితుడై ప్రేమతో దానిని తీసుకొని అతని అనుచరులను దగ్గరకు పిలిచి ఆవిగ్రహమును చూపించి పుష్పమాలలు వేయించి మంగళ హారతులనిచ్చి బంగారు పల్లకి యందు కూర్చుని విగ్రహమును ఒడిలో పెట్టుకొని గంధవతీ పట్టణమునకు పోవుటకు సైనికులను వెంటనిడుకొని బయలుదేరెను.

అవిధముగా వారు అరణ్యమార్గమున ప్రయాణించుచుండిరి. గిరిమహారాజు పట్టువస్త్రములో వున్న జగజ్జనని యైనట్టి ఆదిశక్తి అతని వడిలో పరుండి తనలో తాను ఈవిధముగా ఆలోచింపసాగెను. "నేను ఈనాడు ఇదేవిధముగా వారి పట్టణమునకు వెళ్ళి అంతఃపురము జేరి బిడ్డ వలె అచ్చట పెరిగి పెద్దదై పిల్లలతో సహవాసము చేసి ఆడుచుండు సమయమున యేదేని మాటవచ్చి నాసరిపిల్లలు నన్ను తల్లి తండ్రి లేని పిల్లవు యెవరో మంత్రగత్తెవై యుందువు. రాజుగారికి సంతానము లేనందున అతని రాజ్యమపహరింప వచ్చి నట్టి మాయావివి అని పలు విధములుగా యెద్దేవా చేయుచున్నపుడు యేమి చేయగలను? విని విన్నట్లు పోవలసినదే కదా! ఇది జాగ్రత్తగా గమనించ వలసినట్టి విషయమే. ఇది కలియుగము. కలిపురుషుని ప్రభావము యెక్కువ. అందు వలన వారి సౌధమునకు వెళ్ళుట శ్రేయస్కరముగాదు. కాదని వెళ్ళిన యెడల ఈబిడ్డ తల్లి తండ్రి లేనట్టి దిక్కులేనిదని ప్రజలు నిందింతురే వారి గర్భమున జన్మించినదని యెవ్వరూ చెప్పరు! ఆపేరు జీవితాంతము మచ్చయే గదాయని అనేక విధముల ఆలోచించుకొని వారికిచ్చిన మాట నిలుపుకొనుటకు మహారాజు యొడిలో పట్టువస్త్రములో ఉన్నట్టి అమ్మవారు తటాలున అదృశ్యమయ్యెను.

మహారాజు శిలా విగ్రహమును ఒడిలో పెట్టుకొని యెవ్వరిచేతికి ఇవ్వక పల్లకిలో కూర్చుండి ప్రయాణమై వచ్చుచు కొంత సేపు అమరచి నిదురించి లేచి చూడగా

అతని ఒడిలో పట్టువస్త్రము గప్పిన ప్రతిమ అగుపడదయ్యెను. అంతట మహారాజు భయభ్రాంతుడై దిగులుజెంది ఇది ఏమి వింతయని యెంచి ఆపల్లకి యంతయు వెదకి వేసారెను. హా! దైవమా! ఇదియేమి అన్యాయము! నేను పల్లకీ యైనను దిగలేదే! ఆ విగ్రహమును ఎవ్వరికిగానీ యివ్వలేదే! ఎటుపోయి యుండును. ఆరు సంవత్సరములుగా నా సర్వ సంపదలను వదలు కొన్నది ఇందుకేనా! నాకు స్త్రీరూపమున స్వప్నమందు చెప్పినది శక్తియా ఆదిశక్తియా! లేక నామృత్యువు కోరిన రాక్షస మాయాజాలమా! అని ఆలోచించుచూ వెర్రి వానివలే మతిభ్రమించి పల్లకీ నుండి క్రిందకు దిగి ఒక్కచోటైనను నిల్వక అరణ్యమంతయు వెదుకుచూ పరుగిడసాగెను.

ఆదృశ్యమును గాంచినట్టి అతని సైనికులు ఇది యేమి వింత ఇంత వరకు ప్రశాంతముగా వున్న మహారాజు ఇప్పుడు ఈవిధముగా మారినందులకు కారణమేమై యుండునని వారు ఒకరితో నొకరు చెప్పుకొనిరి. ఆశిలా విగ్రహము సామాన్యమైనది కాదు దైవలీల. దానిని మన మహారాజు బిడ్డయగునని భ్రమించి తెచ్చి నందులకు ఈ విధముగా అతనిని కర్మ పీడించు చున్నది. అటువంటిది ఎప్పటికిని తెచ్చుట మంచిది కాదని చెప్పుకొను చుండిరి. మహారాజు ఆ అరణ్యమంతయు చెట్టనక, గుట్టనక అంతయు గాలించి వెర్రి, వెర్రి కూతలు పెట్టసాగెను. అప్పుడు వారు అతని బాధ చూచి యేమిచేయుటకు దిక్కుతోచక అతని చెంతకు వెళ్ళి అతనిని విషయమేమని ప్రశ్నించినను మారు పలకక వారిని చూచి దుఃఖింపసాగెను. అది చూచి వారును పల్లకిలోనికి వెళ్ళి పరికించి చూచిరి. అందు శిలా విగ్రహము కనబడదాయెను అప్పుడు వారు అది గమనించి మహారాజును రాజనగరకు పిలుచుకొని పోవుటకు ప్రయత్నించగా అతడు ససేమిరా రాడాయెను. అంతవారు ఇక్కడ ఒంటరిగా మహారాజు వదలిన యే ఆపద జరుగునోయని యెంచి కొందరు అతని చెంతనుండిరి కొందరు ఆ వార్త మహారాణి గారికి చెప్పుటకు నగరముకు ప్రయాణమై వెళ్ళిరి.

వారు అరణ్యమార్గము నుండి వేగముగా రాజనగరునకు పోయి మహారాణి యగు జవికినాదేవితో అచ్చట జరుగుచున్న విషయమంతయు తేట తెల్లముగా విన్న వించిరి. ఆవార్త విన్న తోడనే ఆమె స్పృహ తప్పి కుప్పగా కూలిపడి పోయెను. అక్కడ ఉన్న దాసీ, జనము మొదలు సైనికులు మరియు మహామంత్రి విజయవర్మ అందరును ఒక్కసారిగా ఆఘోర వార్తను విని దుఃఖసాగరమున మునిగి యేమి చేయను దిక్కు తోచని వారైరి. వారు కొంతసేపటికి తెప్పరిల్లి జవికినాదేవిని స్పృహ నుండి లేపి ఆమెను ఓదార్చగా మహారాణి వారిని చూచి దుఃఖించుచూ "నాయనలారా

మీరు నాభర్తను చూపుడని వారిని కోరెను. వారు ఆమె దుఃఖమును చూడలేక ఆమెను పల్లకిలో కూర్చుండ బెట్టుకొని మహారాజు చెంతకు తీసుకొని వెళ్ళుచుండిరి.

ప్రతివ్రతా శిరోమణి యైనట్టి జవికినాదేవి "హా దైవమా సర్వేశ్వరా! ఆపత్ బాంధవా! అనాదరక్షకా దుష్టశిక్షణ శిష్టరక్షణార్థమై అవతరించినట్టి ఓదేవా! నీవే మును ముందు మాకు స్వప్నమున కనబడి సంతాన భాగ్యమున్నదని మమ్ము భ్రమింప జేసి ఇపుడు నట్టేట ముంచితివే! అదియుగాక ఆదిపరాశక్తి యగు అమ్మవారున్ను స్వప్నమందు కనబడి చెప్పినదే, కలయే కానీ మీరు సృష్టికి మూలాధారులై జగత్తు నడుపుశక్తి ఉండి సామాన్య మానవులను ఈవిధముగా బాధించుట న్యాయమా! మేము ఎన్ని పుణ్యకార్యములు చేసి యుందుము. కానీ మీకు కనికరము రాదాయెనే! మేము మీకు చేసిన అపకారమేమి? మేము ధరిణిపై యున్నాము. నీవు వైకుంఠమున శేష తల్పముపై పవళించి హాయిగా ఉండి మమ్ము ఇలాంటి బాధలకు గురి చేయించినావే! ఇదేనా మీ భక్తులను కాపాడు మార్గము! మేము చేసిన పుణ్యమునకు ఇది ఒక శిక్ష! సంతానము కలుగునని చెప్పనేల? మేము ప్రతినిత్యము ఆదిపరాశక్తిని కొలవనేల? కొలిచి నందులకు ఈనాటికి ఇదా ప్రతిఫలము? మా గతియేమి? కానీ ఈప్రపంచమున దేవతలున్నారు అనుట వట్టి మాటలేనా! మేము పూజించిన వన్నియు ఒట్టి మట్టి బొమ్మలు, మరియు రాతి బొమ్మలేనా? మేము చేయునట్టి దైవారాధనలు వ్యర్థమేనా! నిక్కముగా మీరు యున్నయెడల మానవులు ఇట్టి అవస్థలు పడరని ఇప్పుడు తేట తెల్లముగా కాన వచ్చుచున్నది." అని అనేక విధములుగా నిందించుచూ మహారాజు ఉన్న స్థలమునకు వెళ్ళి చూడగా రాజు వెర్రి వానివలె కూతలు పెట్టుచూ దుఃఖము వలన మనస్సు నిలుపుకోలేక ఒక రాతి వద్దకు వెళ్ళి తన తలను బాదుకొనుచుండెను. జవికినాదేవి అదిగాంచి భయపడి పల్లకీ నుండి క్రిందకు దుమికి పరుగున రాజు దగ్గరికి వెళ్ళి అతని పాదములపై బడెను. మహారాజు ఆమెను చూచి దుఃఖము భరింప లేక ఒకరి నొకరు కౌగలించుకొని ఇక మనము ఈప్రపంచమున బ్రతుకుట కంటే మరణించుటయే ఉత్తమమని యెంచిరి. యెవ్వరు ఎన్నిచెప్పినను వినక మహారాజు వర నుండి ఖడ్గమును తీసి మొదట భార్య శిరస్సు ఖండించి అటు పిమ్మట తాను మరణించవలెనని నిర్ణయించుకొని భార్య కంఠము తెగవేయుటకు ముందుకు పోవు నంతలో యెచ్చటి నుండియో ఆగుమాగుము అని ఒక శబ్దము వినవచ్చెను. అప్పుడు ఆ గంభీర వాణిని విని వెనకకు తిరిగి చూడ యేమియు అగుపడలేదు. నాల్గు ప్రక్కల పరికించు సమయమున ఓ మహారాజా నీవు చేయునది పొరపాటు అని మరల విన

పడెను రాజు అదృశ్యవాణిని ఎవరు నీవు? అని గద్దించి అడుగగా అందులకు ఆకాశవాణి "ఓ గంధర్వరాజా! నీసాహస కార్యము ఇంత వరకును చేసి అన్నిటిలో నెగ్గినావు కనుక నీవు ఇప్పటికి ధన్యుడవైతివి ఈనాటి నుండి నీకర్మ తొలగి సంతానము లభించు నున్నది. ఇది సత్యం. మీకు యేభయము వలదు. ఆసర్వేశ్వరి యైనట్టి జగజ్జనని యగు అమ్మవారు నీభార్య గర్భమందు జన్మించును. మహారాణి త్వరలో ప్రసవించును. కనుక మీరు ఈప్రదేశమందే ఉండి పుత్రికను తీసుకొని వెళ్ళెదరుగాక అని గంభీర ధ్వనితో సెలవిచ్చెను.

ఆవార్త విన్నట్టి మహారాజు అచ్చటనే ఉండి నిశ్చయించి తన సిబ్బందికి భోజనములు యేర్పాటు చేసెను. అప్పటికి సూర్యుడస్తమించి చీకటి పడెను భోజనానంతరము అందరు అచ్చట చేరి వినోధముగా కాలయాపన చేయగా ఆవెన్నెల వెలుగులో ఒక మర్రి వృక్షము క్రింద నిదురించిరి అర్ధరాత్రి వేళయందు జవికినాదేవి ఆకాశవాణి చెప్పిన విధముగా పదకొండు గంటలకు సద్యోజాత గర్భము ధరించి ప్రసవవేదన ఎక్కువయ్యెను. అక్కడ వున్న దాసీజనులు లేచి ఆమె చెంతకు వెళ్ళిరి అచ్చట యేచాటు లేనందున అందులో ఒక్కరు అక్కడికి సమీపమున ఒక ఈత ఆకుల కుటీరము చూచి యుండుట వలన దాసీ జనుల వెంట ఆమెను పిలుచుకొని ఆ కుటీరమునకు వెళ్ళిరి. దానికి మరుగు లేనందున ప్రక్కన యున్నట్టి తాటియాకుల తడికి తెచ్చి కుటీరమునకు అడ్డుపెట్టిరి, అంత జవికినాదేవికి కొంతసేపటికి స్త్రీ సంతానం కలిగెను. అక్కడ వున్నవారు ఆదిగాంచి సంతోషించి ఆవార్తను మహారాజునకు నెటింగించిరి. ఆమాటలు విన్నట్టి మహారాజు అమితానంద భరితుడై యెనలేని సంతోషముతో అచ్చట వున్న అతని అనుచరులకు బహుమానము లిచ్చి సంతోషింప జేసెను.

మహారాజు తన కోరిక ఫలించినందులకు ఆనంద పరవశుడై అరణ్యమున ఒక్క క్షణమైనను నిలువక ఆబిడ్డను పల్లకిలో కూర్చుండ బెట్టుకొని గంధవతీ పట్టణమునకు ప్రయాణమై బయలుదేరెను. ఆరోజు సాయంకాలమునకు అంతఃపురము చేరుకొనిరి. వారు వచ్చిన వార్త ఆపురవాసులందరికి తెలిసి ఆబాలికను చూచుటకు తండోపతండములుగా వచ్చి ఆబిడ్డ ముఖారవింద తేజస్సును గాంచి ముగ్ధులైరి. ఇన్ని రోజులకు మన మహారాజు గారికి సంతానము కలిగెనని ఆపట్టణ వాసులందురు సంబర పడిరి.

మహారాణికి పదకొండవ రోజు పురిటి స్నానంబులు చేయించుటకు బంధువులకు విదేశరాజులకు పట్టణవాసులకు తెలియ పరచవలెనని యెంచి లేక లేక కలిగినందులకు నామకరణము నాడు అందురు వచ్చిన బాగుండునని మహారాజు భావించి అందులకు అందరికి తెలియజేయుడని ఆ మహామంత్రియగు విజయవర్మకు తెలియజేసెను. ఆ వార్తను విజయవర్మ దేశ దేశములకు ఉత్తరములు పంపి నగరమంతయు చాటింపు వేయించెను.

ఆ విధముగా పురిటిస్నానము రోజు బంధువులు ఇతర రాజులు గంధవతీ పట్టణమునకు వచ్చి. రూపురేఖ లావణ్యముతో చూడ ముచ్చట గొలుపు ఆబిడ్డను బంగారు ఉయ్యాల యందు పరుండబెట్టి ఉత్సవమును గొప్పగా చేసిరి. అచ్చటికి వచ్చిన ముత్తయిదువలు ఉయ్యాల ఊపుతూ జోలలు పాడిరి. ఆబాలిక ముఖారవిందము లోని చిలిపి నవ్వులు తిలకించుచూ కోటి సూర్యప్రకాశంవలే దేదీప్యమానముగా వెలుగు ఆ బిడ్డను గాంచి తెచ్చిన కానుకలను సమర్పించిరి. వారిలో ఒకరి నొకరు ఈబిడ్డను గురించి చర్చించుకొనుచూ అనేక బాధలు పెట్టి వీరి గర్భమున జన్మించి నందులకు ఆబిడ్డ చూపులు చూడ దైవ సంభూతురాలివలె అగుపడుచున్నది. సామాన్యురాలు కాదని తర్కించుచుండిరి. అదియునుంగాక పట్టణ వాసులున్న సరిహద్దు ప్రాంతము నుండియు తండోప తండములుగా వచ్చిన వారి కంధరికి యెవ్వరికి యే కొరతయు లేకుండా అన్న దానము, వస్త్రదానము చేయుచు బ్రాహ్మణులకు గోదానము, భూదానములను కూడా చేసెను ఆతరువాత ఆస్థాన జ్యోతిష్కులు నామనక్షత్రము చూచి ఆ బిడ్డకు గంగాదేవి అని నామకరణము చేసిరి.

ఆనాటి నుండి భార్యభర్త లిరువురూ రాజ్యభారమును విజయవర్మకు అప్పజెప్పి ఆ బిడ్డ యందు మనస్సు నిలిపి అల్లారు ముద్దుగా పెంచుతూ కాలము గడుపుచుండిరి. ఒక రోజు మాళవదేశమున పేరు మోసిన జ్యోతిష్కుడు వారి ఆస్థానమునకు రాగా ఆబిడ్డ జాతకమెట్లున్నదని ప్రశ్నించిరి. అప్పుడాతడు ఆమెను జన్మ నక్షత్రమును బట్టి కొంతవరకు పరికించి చూచి "మహారాజా ఈబాలిక జన్మనక్షత్రము చూడ సామాన్యురాలు వలె కనపడలేదు. దైవసంభూతురాలే ఈబిడ్డ, మీ వంశోద్ధారకురాలు, పూర్వజన్మనందో, ఈజన్మనందో మీరు చేసినట్టి పుణ్యఫలము వలన మీగర్భమున అవతరించి మీపట్టణమున ఉండుటవలన మీపట్టణము పుణ్యభూమిగా వెలయును. నగరమంతయు లక్ష్మీ తాండవించి ప్రజలకు ఎన్నియో మేళ్ళు కల్పించును. మరియు సూర్యచంద్రాదు

లున్నంతవరకు కీర్తి తెచ్చునట్టి బాలికయని పొగడెను.

గంగాదేవి దిన దిన ప్రవర్తమానమై మూడు సంవత్సరములు నిండిన తర్వాత రాజనగరులో తిరుగుచుండెను. అనేక రకముల ఆట బొమ్మలను తెప్పించి ఆమె ముందు పెట్టగా వాటిపై చూపులేక వాటిని ప్రక్కకు నెట్టి అచ్చట సైనికుల చెంతఉన్న ఖడ్గమును ఎత్తి పట్టుకొని ఆ దాసీజనులపైకి గుడ్లు ఉరుముచూ మెల్ల మెల్లగా అడుగులు వేయుచూ వారిపైకి పోవుచుండును. అట్టి వింతపనులు చేయు బాలికను చూచి ఆదాసీజనులు ఆశ్చర్యపడి ఆవార్తను తల్లిదండ్రులకు తెలియబరచిరి. అది విన్న వారు ఆహా! ఇది యేమి వింతలు అని భార్యతో దేవీ ఆనాడు స్వప్నమందు కనబడినట్టి సర్వేశ్వరుండైన కమల నాభుండు ఇచ్చిన మాట నిజమే. మీగర్భమున ఎప్పటికైనను సృష్టిలయకారకురాలగు ఆదిపరాశక్తియైన జగజ్జనని జన్మించునని చెప్పెను. ఆవిధముగా జన్మించినట్టి బిడ్డయే ఈమె. అని చెప్పి వారి యిష్టదైవంబగు మహావిష్ణువును జగన్మాతను అనేక విధములుగా పొగడుకొనిరి.

ఒకానొక దినంబున దాసీ జనులు బిడ్డను ఆటాడించుచూ ఎత్తుకొని ఉద్యాన వనము వైపునకు వెళ్ళి బిడ్డను అచ్చట దింపి అక్కడ ఉన్న పుష్పములను కోయుచూ బిడ్డచేత ఇచ్చుచూ ఆ ఉద్యానవనము తిరుగుతూ వినోదముగా కాలయాపన చేయుచు కోసి యున్నట్టి పుష్పములను మాలలు కట్టు చుండిరి. అప్పుడా బాలిక ఆ ప్రదేశమందు అటు ఇటు తిరుగాడు చుండగా అచ్చటికి ఎటునుండియో ఒక త్రాచు పాము ఆబాలిక చెంతకు వచ్చి పడగవిప్పి ఆడు చుండెను. అదిచూచి మరికొన్ని సర్పములు అచ్చటికి వచ్చి పడగలు విప్పి, బుసలు కొట్టుచు చెంతకు చేరగా అప్పుడు ఆబాలిక వాటిని పట్టి ఆటాడు చుండెను. బాలిక అగుపడ నందున దాసీలు భయభ్రాంతులై చుట్టూ పరికించి చూడ ఒక చెట్టు క్రింద సర్పములతో ఆటాడు బాలిక కనపడినది. భయకంపితులై నోట మాటరాక తడబడి ఆ దాసీజనము అల్లంతదూరములో నున్న ఆ బాలికను పిలువగా ఆ బాలిక చిరునవ్వుతో పలుకరించెను ఆమాటలు వినిన వారు దిగులుపడి ఈనాటికి మనకు శిరచ్ఛేధము తప్పదని యెంచి చింతాక్రాంతులై కూర్చుండిరి. ఎంతసేపైనను ఆబాలిక రానందున వారి తల్లి తండ్రి బిడ్డను పిలుచుకొని రమ్మని సైనికులను పంపిరి. వారు వచ్చి అచ్చట దుఃఖించుచున్న ఆపరిచారికలను, ఆదృశ్యమును చూచిరి. అప్పుడా సైనికులు దిగులుజెంది తెగించి ఆ బాలిక చెంతకు వెళ్ళగా బాలిక చుట్టూవున్న సర్పములు చెంతకు రానివ్వక బుసకొట్టి వారిని తరిమెను. బిడ్డ అచ్చట నుండి

ముందుకు రాదాయెను. ఎంతవరకును పోయినవారు రానందున మహారాజును అతని భార్యయు బిడ్డను వెతకుచూ అచ్చటికి వచ్చిరి. గడ గడ వణకుచు, నోటమాట లేక కంట నీరు పెట్టి దాసీలు, సైనికులు, తూర్పుదిశ చూప ఇది యేమి వింతయని వారు అచ్చటికి వెళ్ళిచూడగా బాలిక సర్పములతో ఆడుచుండెను. అప్పుడు తల్లియగు జవికినాదేవి భయపడి తల్లీ గంగాదేవి! అని పిలిచెను. అమ్మా నీవు ఎందులకు ఇచ్చటికి వచ్చితివి. అని అచ్చట ఉన్న సర్పములను చేత పట్టుకొని బాలిక సమీపమునకు వచ్చెను. మహారాణి "తల్లీ గంగాదేవీ! అవి విషసర్పములు. వాటి జోలికి పోవుట మంచిది కాదు వాటిని విడచిరావమ్మా" అని అనేక విధముల వేడుకొనగా ఆ బాలిక తల్లితో "అమ్మా యేల భయపడెదవు అవియన్నియు మనము సృష్టించినట్టివే! మనలను యేమి చేయజాలవు " అని వాటినన్నిటిని అచ్చట విడిచి తల్లి చెంతకు చేరెను. అంతట వారు బాలికను తీసుకొని దాసీలను వెంట నిడుకొని అంతఃపురము జేరి గంగాదేవితో "అమ్మా ఇంక ఎప్పుడైనను ఇటువంటి పనులు చేయరాదు. అవి క్రూరమృగములు వాటితో స్నేహము మంచిది కాదు" అని అనేక విధములుగా చెప్పగా అందులకు గంగాదేవి అమ్మా "నీవు వెర్రిదానవు అవి ఎట్టి క్రూరమృగములైనను మనకు లోబడి మెలగవలసినదే. సర్వసృష్టికి మూలకర్తను అవి యేమి చేయగలవని చెప్పెను." ఆమాటలను ఆలకించినట్టి తల్లిదండ్రులు "హాదైవమా! ఈబిడ్డ పలుకులు విచిత్రముగా కనబడుచున్నవే యేమి చేయుట అని చింతించి కొంత తడవునకు తెప్పరిల్లి ఇదేదో దైవమాయగ నున్నది జరుగక మానదు" అని మిన్నకుండిరి.

ఆ వింత సంఘటన చూచిన వారందరు ఆమె చెంతకు వెళ్ళి పాదములపైబడి "అమ్మా జగత్ కళ్యాణానికవతరించి నట్టి ఓ మాతా! సర్వమంగళ యోగేశ్వరీ, సత్య జ్ఞానేశ్వరీ, సౌందర్యరత్నాకరీ, జగదాంబ" అని అనేక విధములుగా స్తుతించి తల్లీ మా ప్రాణములు కాపాడి మాపసుపు కుంకుమలు నిలిపినందులకు నీవు సామాన్య మానవ బాలిక కాదు. నిక్కముగా దైవసంభూతరాలైనట్టి గంగాదేవివి" అని అనేక విధములుగా పొగడిరి.

ఆ విధముగా గంగాదేవి అల్లారు ముద్దుగా పెరుగుచూ పండ్రెండు సంవత్సరములు పెరిగెను. నాటినుండి ఆ బాలిక ఎవ్వరితో మాటాడకుండా మౌనముగా కూర్చుని ఆలోచించు కొనుచుండెను. ఆ విధముగా ఉన్న గంగాదేవిని చూచిన ఆమె తల్లి తండ్రులు బలవంతముగా పట్టు పట్టి అడుగగా ఏమియు బదులు చెప్పలేదాయెను. మరీ, మరీ అడుగగా ఏమి చెప్పుటకు దిక్కుతోచక నిజము చెప్పినట్లయితే నా తల్లిదండ్రులు

బాధపడుదురు. నేను వారి మనస్సు బాధ పెట్టుట భాగ్యము కాదని యెంచి ఈ విధము చెప్పెను.

అమ్మా! మీకు అనేక బాధలు పెట్టినను మీరు వెనుకాడక నా పై మనస్సు నిలి నన్ను సేవించునందున మీ వంశోద్ధరణార్థమై మీ గర్భమున జన్మించి ఇప్పటి వర మీ బిడ్డయని పేరు తెచ్చుకొన్నట్టి ఆదిపరాశక్తినైన నేను ఈనాడు మీ అంతఃపురమ ఉన్న బిడ్డగా తిరుగాడు చున్నాను. ఈ విషయము ఎవ్వరికైనా చెప్పిన యెడల మీ కీడు కలుగును. ఇప్పుడు పదమూడవయేడు జరుగుచున్నది ఇక మీదట నేను విధముగా ఇచ్చట ఉన్న యెడల దేశమంతయు అలజడులు జరుగును. ఆనాడు మ విష్ణువు మీకు ఇచ్చిన మాట ప్రకారము మీగర్భమున జన్మించితిని నిజము చెప్పుట మనస్సురాక ఇన్ని రోజులు వ్యధ పడుచుంటిని. కాలము మించుట వలన చె చున్నాను. వినుడు నేను త్రిమూర్తులకు చెప్పిన విధముగా కలియుగమున అవతరి యెక్కడ పాపము మెండుగా ఉండునో అచ్చట చేరి పాపాత్ములను శిక్షించి భా నెలకొల్పు భారము నాపైయున్నది. దీనికి ముందు జరిగిన యుగములందు రాక్షసు విపరీతముగా ఉండినను న్యాయముగా ప్రవర్తించు చుండిరేగాని ఈ కలియుగమ మానవులు వారికంటే ఇంకను నీచముగా ప్రవర్తించుచూ ఒకరినొకరు చంపుకతిం న్నారు. అందువలన పాపాత్ములు అధికమై పుణ్యాత్ములు తక్కువగు చున్నారు.

అందువలన నేను దేశసంచారము చేయదలచినాను అని చెప్పగా అది విని వారి తల్లిదండ్రులు సమ్మతించక "అమ్మా మేము అనేక బాధలు పడి కని అల్లా ముద్దుగా పెంచినందులకు ప్రతి ఫలముగా నీవు మమ్మ విడిచి పోవుట న్యాయమ తల్లీ! అని అనేక విధములుగా దుఃఖించు సమయమున గంగాదేవి వారిని ఓదా చెప్పవలసిన రీతిగా వారికి నచ్చచెప్పగా వారు సమ్మతించిరి. అప్పుడు గంగా సంతోషించి వారి చెంతకు వెళ్ళి వారిచుట్టూ ప్రదక్షణము చేసి నమస్కరించి "అమ మీతో ఒక ముఖ్య విషయము తెలుపుచున్నాను. నేను ప్రపంచమందు ఎక్కడ ఉన్న మీచెంత ఉన్నట్టు భావించి ప్రజలకు తెలుపుచుండవలెను. మీరెప్పుడైనను చూడదల కొన్న యెడల నన్ను గూర్చి తలచిన యెడల కొంత ఆలస్యముగానైన మీ చెంత వచ్చి మిమ్ములను విచారించి సంతోషపరచి వెళ్ళుచుందును. ఇది అతి రహస్యమై ఎవ్వరికి చెప్పకూడదు అటు చెప్పినట్లయిన మీకు హాని కలుగును. అదియుగాక మీ ఇన్ని బాధలు పడినందుకు మీ పేరున్నూ కలియుగము నందు నిల్వదని చెప్పెను.

అందులకు వారు సమ్మతించి ఆ బాలికను దీవించగా గంగాదేవి దేశపర్యటనకు బయలుదేరెను. దేశములో అనేక ప్రదేశముల యందు ఉన్నట్టి గ్రామదేవతలై వెలయు తన ప్రతిరూపముల లీలలు పరిశీలించు కొనుచు తను సేవించునట్టి భక్తులను కాపాడి పాపులను శిక్షించుచూ పల్లెలు, పట్టణాల యందు సంచరింపసాగెను.

ఈ విధముగా గంగాదేవి అనేక ప్రదేశములందు తిరిగి పుణ్యాత్ములను రక్షించుచూ దుష్టులను శిక్షించుచూ పర్యటన చేయుచు కడపజిల్లా బద్వేలు తాలుక కంది మల్లయ్య పల్లి మార్గమున పోవునప్పుడు అక్కడ గల అరణ్య ప్రాంతమున గల వేపచెట్టు క్రింది ఆపల్లె గ్రామదేవతయగు పోలేరమ్మ దేవళము శిథిలావస్థ యందు ఉండుట చూచెను. ఆ కందిమల్లయ్య పల్లె గ్రామస్తులకు ఆమెపై భక్తి విశ్వాసము నశించి యుండుట గమనించి అచ్చట నిలిచి ఆ గ్రామస్తుల పరిస్థితి పరికించి చూడ వారు ధన దాన్యసంపదలతో తుల తూగి గర్వమధాందులై యుండుట కనపడెను. వారి గర్వ మణచుటకు ఒక ఉపాయము చేసి ఒకనాడు అర్ధరాత్రి వేళయందు వారి పూరిపై బడి వారిని భయభ్రాంతులను చేయసాగెను. అది గ్రహించిన వారు మనవూరికి ఏదో ముప్పు వాటిల్లుచున్నదని యెంచి యేమి చేయుటకు దిక్కుతోచక కాలము గడుపుచుండ రోజు రోజుకు విపరీతములు పెరిగి పెద్దవగుచు అక్కడ నివసించు వారు పరస్పరము కలహములాడుట ప్రజలు జబ్బులతో బాధపడుట పశువులు అకస్మాత్తుగా మరణించుట పాడిపంటలు నశించుట ఇట్లు అనేక రకములుగా విపత్తులు వాటిల్లునట్లు చేసెను. అంతట గ్రామస్తులకు ఇది యేమి అని అర్థముచేసుకొనక గర్వమధాందులై యుండిరే గాని దైవభక్తి యందు ఆశక్తి చూపలేదు.

ఇట్లుండ ఒకనాటి రాత్రి దైవభక్తి పరాయణుడైనట్టి ఒక వృద్ధుడు నిద్రించు వేళయందు అతని స్వప్నమున అమ్మగారు కనపడి "ఓరీ భక్తా మనుషు చిన్ననాటి నుండి మీరు మీ పెద్దలు చిన్నలు ఊరికి తూర్పు దిశ యందుండు గ్రామదేవతయగు పోలేరమ్మను కొలుచుచూ జాతరలు చేయుచుంటిరి. కానీ మీ బిడ్డలు పెద్దలైనప్పటి నుండి పోలేరమ్మ మాట మరచి ప్రవర్తించుచున్నారు. కానీ ఇప్పుడైనను ఆమెకు నిత్య నైవేద్యములు జరిపి అచ్చట జరపవలసినట్టి కార్యములు సక్రమముగా నెర వేర్చిన యెడల మీకు మీ గ్రామమునకు మంచి జరుగును. లేని యెడల ఇప్పుడు మీ గ్రామములో జరుగుచున్న వింతలు మీ మృత్యువునే తీసుకొనును జాగ్రతగా మెలుగుడని చెప్పిఅంతర్ధానమయ్యెను.

స్వప్నమును కన్నట్టి వృద్ధుడు దిగ్గున మేల్కొని అటు, ఇటు జూడ యేమియు అగుపడదాయెను. ఆ మాటలు విన్నట్టి వృద్ధుడు ప్రొద్దున లేచి ఆ గ్రామస్తులను చేర్చి వారితో రాత్రి స్వప్నమున తాను కన్నదంతయు తెలియజేసెను. అంతట వారు తీవ్రముగా ఆలోచించి ఇది నిజమని యెంచి ఆనాటినుండి భక్తి భావముతో పోలేరమ్మను కొలుచుట మొదలు పెట్టిరి. ఏటేట జాతరలు చేయుచు ఆమెను సంతోష పరచుచుండిరి. ఈ విధముగా పోలేరమ్మ మహిమ అచ్చట ప్రాంతములందు ఎక్కువ విస్తరించు కొనుచుండ ఆమె చెంతకు చుట్టు ప్రక్కల గ్రామముల నుండి ప్రజలు తండోపతండములుగా వచ్చి అనేక విధముల పూజలు చేసి ముక్తిపొందుచుండిరి.

ఈ విధముగా ఆమె గ్రామస్తుల చెంత పూజలు అందుకొనుచుండు సమయమున శ్రీవిరాట పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి ఆ ప్రాంతములకు వచ్చి అచ్చట నివాసమేర్పరచుకొనదలచి ఒక కుటీరము యేర్పరచుకొని కాలము గడుపుచుండెను. ఆ సమయమున పోలేరమ్మ జాతరచేయుట గమనించి ఆ రోజు జాతర ముగియు వరకు అచ్చట యేమి తెలియని వానివలె సంచరించుచుండెను అచ్చట ఆమెకు అనేకమగు జీవజంతువులను బలి యిచ్చుట ప్రొద్దుపోవు వరకు గమనించెను. అచ్చట ఉన్న వారందరు వెళ్ళిపోగా అతడు వేపచెట్టు వద్దకు వెళ్ళి అచ్చట ప్రత్యక్షమైన పోలేరమ్మతో దేశకాల పరిస్థితుల గూర్చి అనేక విధములుగా సంభాషించు సమయమున వీరబ్రహ్మేంద్రస్వామి ఆమెతో అమ్మా ఆదిశక్తి! నేను తిరుగుస్థలము లన్నియు కొన్ని ప్రదేశముల యందు దైవభక్తి మెండుగా యున్నది. మరికొన్ని ప్రదేశము లందు పాపాత్ములు యెక్కువై ఉన్నారు. కొన్ని ప్రాంతము లందు మహ్మదీయులు విజృంభించి, హిందువులను అనేక బాధలు పెట్టుచున్నారు. దక్షణప్రాంతమున అధికముగా వారి దౌర్జన్యము హెచ్చు పెరుగుచున్నవి. దానిని అరికట్టుటకు శాంతస్వభావమున మెలగవలెను. అటులేకున్న చేరుచెడును. ఇందులకు యేమిచేయవలెనని ఆదిశక్తిని అడుగగా అందులకు అమ్మవారు స్వామి మీరు ఇచ్చట ఉండి మహ్మదీయుల స్వభావము మార్చుటకు ప్రయత్నించుడు నేను అచ్చటికి వెళ్ళి కొంతవరకు వారిని మార్చుటకు ప్రయత్నింతును. అట్లు వినని యెడల నా చేతనైనంత పని చేయుదును. దీనికి మీరే మందురని అడిగెను అందులకు స్వామి సమ్మతించెను. ఆమేరకు ఆమె దక్షణ ప్రాంతమునకు బయలుదేరగా శ్రీవీరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి అమ్మవారితో "జగజ్జననీ నీ అవతారములు ఎచ్చటెచ్చట ఉన్నవో అచ్చట నీవు అప్పుడప్పుడు నీ ప్రభావము చూపవలెను. లేని యెడల భక్తి భావములు నశించును. నీవు

ఎచ్చటైనను స్థిర నిలయము చేసుకొను వరకు నీ మహిమలు పల్లె పట్టణముల యందు చూపుచుండ వలెనని" అభ్యర్థించెను అందులకు అమ్మవారు సమ్మతించి దక్షిణ ప్రాంతమునకు బయలుదేరెను.

ఆయన చెప్పిన రీతిగా అమ్మవారు దక్షిణ ప్రాంతమునకు వెళ్ళి అక్కడ జరుగు పరిణామములు పరికించగా మహ్మదీయులు నల్లమందుతో కూడిన ఆయుధములతో హిందూ రాజులపై బడి వారి రాజ్యములను కొల్లగొట్టి స్వాదీనము చేసి కొనుచూ దేవాలయములను ధ్వంసము చేసి విగ్రహములను కూడా నాశనము చేసి ఆ దేవస్థానపు బంగారు, వెండి, నగలు సైతము అపహరించుచూ, పల్లె పట్టణాదుల పై బడి ధన వంతులను హతమార్చి దోపిడీలు జరుపుచూ, హిందూస్త్రీలను చెఱబట్టి వారి వ్రతములను చెఱుపుచూ, అడ్డము వచ్చిన వారిని హతమార్చుచూ, ఆగడములు చేయుచుండిరి. దేశమున వీరి దౌర్జన్యములకు అడ్డు లేకుండుట అమ్మవారు గమనించెను. అటులచేయు ఘోరకృత్యములను చూచిన అమ్మవారు సహించలేక క్రోధోద్రిక్తురాలై వారిని సంహరించుటకు ప్రయత్నించి తిరిగి శాంతము వహించి కొంత వరకు ఆలోచించుకొని "వీరిని ఈ విధముగా సంహరించినట్లయితే మంచి చెడ్డయు లేక అందరు మరణింతురు. కావున వీరికి కొంత వ్యవధి యిచ్చిన అప్పటికైనను మనసు మారి మంచి మార్గమునకు వత్తురేమో అటులేని యెడల వారిపాపములను వారే పరిష్కరింపు కొందురని" యెంచి అచ్చట నుండి వేరొక ప్రాంతమునకు వెళ్ళెను. అక్కడ గూడిన తెలుగు జాతివారు. తురుష్కుల ధాటికి తట్టుకొన లేక గ్రామాదులు పట్టణములు విడిచి భార్య బిడ్డలతో పసిపిల్లలను తీసుకొని అరణ్యములు చేరి కొండ గుహల యందు చెట్టు తొర్రల యందుండుట గ్రహించెను

అటుపై రామాపురం చేరినట్టి అమ్మవారు ఆపరిసర ప్రాంతమంతయు చూడ అచ్చట గూడా పరిస్థితి అదేవిధముగా నుండెను. అప్పుడు గంగాదేవి రామాపురము నందు కొంత కాలము ఉండనెంచి ఊరియందున్న ఆలయమునకు వెళ్ళి అందు కూర్చుండెను. అప్పుడు ఆ గ్రామస్తులు అటు, ఇటు దారిన పోవుచూ ఆలయము లోనికి చూడ ఒక నవయవ్వన సౌందర్యవతి యగు స్త్రీ వారి దృష్టియందు బడెను. అప్పుడు ఆవూరి యందు వుండు కొందరు కొంటె గాండ్రు అచ్చటికి వెళ్ళి ఆమెను చూచి వెకిలి చేష్టలతో ఎగతాళిగా మాట్లాడిరి. వారి ప్రవర్తన చూచిన అమ్మవారు వారిపై కోపగించక బిడ్డలు తల్లితో తప్ప యెవ్వరితో మాట్లాడరని శాంతము వహించి వారికి భక్తి మార్గము చూపవలెనని తలంచుకొని వారితో సంభాషించు చుండ రామా

పురంలోని వారు ఒక్కొక్కరుగా ఆ ఆలయము చెంతకు చేరిరి. అక్కడ చేరిన వారు ఆమెనుద్దేశించి అమ్మా "మీదే వూరు? ఇచ్చటికెందులకు వచ్చియున్నావు? నీ పేరేమి? నీ తల్లిదండ్రి నామధేయమేమి? మాకు తెల్పుమని అడుగగా వారితో మానవ రూపములో ఉన్న అమ్మవారు "నాయనలారా! నాకు ఒక ఊరని స్థిరము లేదు. నేనెక్కడ ఉన్నను ఆ ఊర్లన్నియునావే, అందరు నావారే, సృష్టి అంతయు నా యందే ఉన్నది. నేను కొంతకాలము ఇచ్చట ఉండవలెనని తలంచి ఈ ఆలయము చేరి యున్నాను. ఇందులకు మీ గ్రామస్తులు యేమి చెప్పెదరని అడుగగా ఆవూరి యందుండు తుంటగ్లు ఆ వూరి స్త్రీలు ఆ మాటలు విని "అమ్మా నీవు ఇటు చెప్పుట వలన మాకేదో అనుమానమగు చున్నది. నీ బోటి ఆడది ఇచ్చట వున్న మా గ్రామము చెడును. నిండు ప్రాయము గలిగి ఒంటరిగా దేశము సంచరించుచున్నావే! స్త్రీలు ఒంటరిగా వున్న యెడల యే సమయమునకు యేమి జరుగునో! అదియుగాక మా వూరు అనేకుల గర్వ మధాంధులున్నట్టి పల్లె. నీకు పొద్దురాదు. కావున ఉండ తగదు" అని ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగా అవమానముగా మాటలాడి నవ్వుకొన సాగిరి.

ఆ మాటలు విన్నట్టి గంగాదేవి వారిని చూచి చిరునవ్వు తొలకించుచూ వారి మాటలు లక్ష్యపెట్టక మౌనముగానుండెను. అది చూచిన ఆ గ్రామ ప్రజలు మండి పడి ఈమెను ఇక్కడ ఉండనీయరాదని మర్యాదగా చెప్పిన ఈ ముండపోదని యెంచి అందులో కొందరు ఆలయము నుండి బయటకు గెంటుటకు ప్రయత్నించి ఆమె చెంతకు వెళ్ళిరి. అంతలో వారి గ్రామము నాలుగు ప్రక్కలు అగ్ని ప్రమాదము సంభవించి ఇంట్లు మండ నారంభించగా ఆ వూరిలోని వారు కేకలు పెట్టసాగిరి. ఆ సమయంబున అక్కడ ఉన్న జన సమూహమంతయు ఆ ప్రమాద స్థలమునకు వెళ్ళు చుండ గంగా దేవి మాత్రము మౌనముతో కూర్చుని యుండెను. అంతట గ్రామస్తులు భయ భ్రాంతులై దిగులుజెంది ఇక మనమెన్ని చేసినను గాలితోడై యున్నదని పిల్లజల్లలను బయటికి పిలుచుకొని కేకలు పెట్టి దుఃఖించుచూ ఊరి వెలుపలకు చేరి బాధపడ సాగిరి.

ఆ ఊరిలో కొందరు పెద్దలు చేరి ఒకరితో నొకరు "యేమయ్యా! మనకు బుద్ధి వచ్చినప్పటి నుండి ఈ పల్లెకు యే హానియు జరుగలేదు కదా! ఇప్పుడు పిల్లలు పెద్దలై దైవ భక్తి లేక మెలగుటచే ఇటువంటివి సంభవించు చున్నవి. ఇది ఏమి వింతయో ఉన్నట్టు ఉండి అకస్మాత్తుగా అగ్ని ప్రమాదము జరిగినది" అని తర్కించుకొనసాగిరి. అప్పుడు వారికి ఆలయమున ఉన్న స్త్రీ గుర్తుకు వచ్చెను. అచ్చటికి వెళ్ళి చూడగా ఆమె యోగనిష్ఠలో కూర్చుని యుండెను. అది గాంచినవారు ఈమె ఎవరో

దేవత. ఈమెను అనేక విధములుగా నిందించి నందున మనకు యిలాంటి శాస్తి జరిగినది. అని యెంచి ఆమెతో "అమ్మా! నీ వెవరో గుర్తించనందుకు మాకు ఇట్టి ఆపద జరుగుచున్నది. కావున నీవు మా యందు తప్పులెన్నక కాపాడుము తల్లి! పిల్లలను ఒకటిగా చేయుము. నీ మాటలు చూడ ఆదిశక్తివలే ఉన్నావు. మా అపరాధము మన్నించుము" అని ఆమె పాదములపై బడగా అప్పుడు అమ్మరూపములో ఉన్న గంగాదేవి వారిపై కరుణించి మౌన నిష్టనుండి లేచెను. వెంటనే ఎక్కడి మంటలు అక్కడ తగ్గి ఆ ఊరు మునుపటివలాగ యథాప్రకారముగా ప్రజలకు కనబడెను. ఆ పల్లె ప్రజలు అదిచూచి అమితానంద భరితులై ఆమె చెంతకు వెళ్ళి ఆమెను అనేక విధములుగా పొగడుట మొదలు పెట్టిరి. అప్పుడు అమ్మవారు శాంతము వహించి వారి గర్వమణిచి తగిన గుణపాఠము నేర్పినందులకు మనస్సులోనే సంతసించి ఇక నుండి మీరు ఆదిపరాశక్తి యైనట్టి అమ్మవారిని మీ గ్రామ మందు గ్రామదేవతగా నిలుపుకొని సేవించిన యెడల అనేక విధములుగా మంచి చేకూరును. అటులేని యెడల అనేక కష్టములకు గురియయ్యెదరు" అని చెప్పి వారిని దీవించెను. అచ్చట నుండి వెళ్ళుటకు ప్రయాణముకాగా ఆ ఊరి ప్రజలు అమ్మా నీవు ఇప్పుడు పోవుట మంచిది కాదు నీవు కొంతకాలమైనను ఇచ్చట ఉండి నీ బిడ్డలను కాపాడు చుండవలెనని అనేక రీతులుగా వేడుకొనగ అమ్మవారు వారి మాటలకు జాలిపడి సరేయని వారికి మాట ఇచ్చి కొంతకాలము అచ్చటనే ఉండి వారికి కొన్ని ఉపదేశముల నిచ్చి మరియొక చోటకు ప్రయాణము సాగించెను. ఆ నాటి నుండి రామాపురం గ్రామస్తులు ఆదిపరాశక్తియైనట్టి అమ్మవారిని కొలుచుచూ జాతరలు చేయుచు సుఖశాంతులతో విరాజిల్లుచుండిరి.

అమ్మవారు ఆ ఊరు విడిచి దక్షిణ ప్రాంతమున కొంత దూరము సంచరించి అచ్చటి వింతలను కనుగొనుచు ఒక గ్రామము చేరి అక్కడ జరుగు కాల పరిస్థితులు గురించి అచ్చటి వారినడగెను. అందుకు వారు "ఇచ్చట అనేక జాతులు తెలుగు వారు నివసించుచున్నారు. నీవు యెవ్వరు? నీదేవూరు? నీ నామధేయంబు యేమి? ఇచ్చటకు ఒంటరిగా రాగల కారణమేమని ప్రశ్నించిరి. ఆ మాటలు విన్నట్టి గంగాదేవి వారితో "అన్నలారా! అన్ని గ్రామములు నావే, అన్ని నామంబులు నావే, ఈ సృష్టికి మూల కర్త నేనని చెప్పెను. అట్టి మాటలు విన్నట్టి ఆ వూరి వారికి కొంత దైవభక్తి ఉండుట వలన కొంత తడవు ఆలోచించి తిరిగి ప్రశ్నించిరి. అపుడు ఆమె అదే విధముగా సమాధానము చెప్పి నా పేరు గంగ యని దేశసంచారమై వచ్చి ఆ దేవగిరి గ్రామమందు కొన్ని రోజులు ఉండదలచి అచ్చటకు విచ్చేసినానని చెప్పెను.

ఆ మాటలు విన్నట్టి ఆ గ్రామస్తులు ఆమె దివ్య ముఖారవిందమును చూచి ఈమె ప్రతివ్రతా శిరోమణియో లేక దైవాంశ సంభూతురాలుగనో కనబడుచున్నదని తలచి ఆమెను గౌరవముగా పలుకరించి వారి గ్రామమందే ఒక నివాస స్థావరము ఏర్పాటు గావించిరి. "అమ్మా నీవు ఇచ్చటనే ఉండి మా కందరికిని అక్కచెల్లెలు వలె మాతో మెలుగుచుండ మని చెప్పి ఆమెకు తోడుగా ఒక వృద్ధురాలిని నియమించి ప్రతి రోజు ఒక్కొక్క ఇంటివంతున భోజనసామాగ్రి ఇచ్చుచుండిరి. ఆమెయు ఆ విధము గానే ప్రతి రోజు కాలము గడుపుచూ ఆ గ్రామ ఆలయమును శుభ్రపరచి ప్రతి నిత్యము దైవారాధనలు చేయుచుండెను. కొంతకాలము గడువ ఆ గ్రామము మునుపు కంటే ఎక్కువ అభివృద్ధి చెంది పాడిపంటలు సమృద్ధియయ్యెను. ఈ విధముగా గంగా భవానీ వచ్చినప్పటి నుండి ఆ గ్రామము అభివృద్ధి నొందుట ఆ గ్రామస్తులు గమనించి ఆమెను దైవముగా భావించుచు కాలము గడుపు చుండిరి. ఇట్లుండ వున్నట్లుండి ప్రక్క గ్రామమంతయు అనేక రకములైన బాధలకు గురియై వ్యాధులతో నిండి ఎన్ని విధములు జాగ్రత్త తీసుకొన్నను నయము కాక అగచాట్లు పాలైరి. ఇక తామేమియు చేయలేమని తలంచి ఆ ఊరు వారందరు గ్రామదేవత యొద్దకు వెళ్ళి ఆమెకు అనేక మైన మొక్కుబడులు చేసి అమ్మా మా వ్యాధులు నయమైనట్లయిన మీ చెంతకు వచ్చి మీ మొక్కు బడులు చెల్లించి ధూప దీప నైవేద్యములతో మిమ్ములను సేవించెదమని" అనేక విధములుగా అమ్మవారిని వేడుకొని దుఃఖించుచూ వెళ్ళు చుండ గంగా భవానీ ఆదృశ్యమును గాంచి వారి చెంతకు వెళ్ళి, "అమ్మలారా మీరు పోవునపుడు సంతోష ముగా వెళ్ళి తిరిగి వచ్చునప్పుడు దుఃఖించుచూ వెళ్ళుట యేల" యని ప్రశ్నించెను.

ఆ మాటలు విన్న వారు ఏమియు చెప్పజాలక విపరీతముగా దుఃఖింప సాగిరి. అప్పుడు గంగాదేవి వారిని ఓదార్చి కొంత తడవునకు మరల ప్రశ్నించగా వారు ఆమెను చూచి "తల్లీ మా వాండ్లు అందరు ఒకరి వెనుక ఒకరు వ్యాధి గ్రస్తులై పదు నైదు సంవత్సరము లైనది. వారిని అనేక దేశములు తిప్పి అచ్చట గల భూత వైద్యులు, రాచవైద్యులచే యెంత వైద్యము చేయించినను ఇంత వరకు శరీరారోగ్యము కుదరనందున ఇక యెప్పటికైనను ప్రాణహాని తప్పదని యెంచి బాధలను చెప్పుకొని మనస్సు నిలుపుకొన లేక దుఃఖించుచున్నాము అని చెప్పిరి.

ఆలయము నుండి నీరసముగా వచ్చు ఆ వ్యాధి గ్రస్తులను చూచిన గంగా భవాని వారిని చెంతకు పిలచి వారితో ఓ నాయనలారా అమ్మలారా మీకు ఒక్క విషయము చెప్పెద వినండి, మీ వూరి గ్రామదేవతయగు పాలేటమ్మ వారు సామాన్య

రాలు కాదు. ఆమె ఆదిపరాశక్తియైనట్టి జగజ్జనని రూపము. ఆశక్తి లీల అమోఘమైనది. నమ్మిన వారిని యెట్టి కష్టముల యందుగాని తప్పక కాపాడునట్టి శక్తి స్వరూపిణి" యని చెప్పి వారి వెనుకకు మరల్చి ఆవూరి ఆలయము చెంతకు వెళ్ళి అక్కడ ఉన్న కోనేటి యందు నీరు తెచ్చి కొంత తడువు ధ్యానించి వారిపై చల్లి వారికి తీర్థముగా ఇచ్చి విడవక సేవించిన మీ వ్యాధులు నయమగునని చెప్పి పంపెను. అప్పుడు వారు ఆ తీర్థమును తీసుకొని గంగాదేవికి నమస్కరించి అనేక విధములుగా పొగడి వారి నివాసంబులకు వెళ్ళిరి.

అప్పటి నుండి వారు ఆమె చెప్పిన విధముగా యేడురోజులు సేవించి ఎనిమిదవ రోజు ప్రొద్దున లేచి చూడ వారి శరీర ఆరోగ్యము కుదుట పడి పూర్వతేజస్సు కనబడెను. అది చూచి వ్యాధిగ్రస్తులందరు ఒక్క చోటకు చేరి ఒకరినొకరు ప్రశ్నించుకొనగా అందరికిని వారి వారి శరీరములు చక్కబడి కానవచ్చెను. అంతట వారందరు అమితానందముతో ప్రక్క గ్రామ మందుండు గంగాదేవి చెంతకు వెళ్ళి ఆమెకు సాష్టాంగ దండప్రమాణము చేసి పాదంబులు విడువక ఆమెను అనేక విధముల స్తుతించిరి. అమ్మా నీవు సామాన్య మానవురాలు కాదు లోక కళ్యాణమునకై అవతరించినట్టి దేవతవు. ఆనాడు మీమాటలు విని మేము ఆశ్చర్యము జెందితిమి. ఇవి ఇప్పుడు ఆలోచించగ నీవే" యని గోచరమగుచున్నది. అని చెప్పుచు పాదంబులు విడువని వారైరి. అంతట గంగాదేవి వారిని దీవించి వారితో "నాయనలారా! మీరు అన్నట్టు నేను దేవతను కాదు. నేను సామాన్య మానవురాలనే నాకు ఇంతటి శక్తి ఎట్లు లభించినదంటే నేను నిత్యము దేవీ పూజ చేయుట వల్లనే అని చెప్పి వారికి అనేక రీతులుగా జ్ఞాన మార్గములు ఉపదేశించి వారిని నివాసములకు పంపెను. ఆ నాటినుండి వారు పోలేరమ్మ వారిని అనేక విధములుగా సేవించి జాతరలు చేయుట మొదలిడిరి. అమ్మ రూపములో ఉన్నట్టి గంగాదేవిని మానవురాలు కాదని ఆ ప్రాంతము వారు యెంచి ఆమె ప్రజలకు చేయు సహాయముల గూర్చి అనేక ప్రాంతముల యందు వెల్లడిచేసిరి. ఆమెను దర్శించుటకు అనేకులు గుంపులు గుంపులుగా వచ్చి సేవించుకొని వారి కోర్కెలను తీర్చుకొని ఆమె దీవెనలు అందుకొని వెళ్ళుచుండిరి. ఇట్లుండ ఆ వూరికి కొంత దూరమున బ్రాహ్మణ అగ్రహార మందు బ్రాహ్మణ దంపతులకు వివాహమై రెండు సంవత్సరములు నిండిననూ సంతానము లేక దుఃఖించుచుండిరి. భర్తకు కుష్టురోగము సంభవించి బాధపడు చుండెను. అతని భార్య ఇరువది సంవత్సరముల యవ్వనమందుండి పతియే సర్వస్వమని నమ్మినట్టి పతివ్రతా శిరోమణి గంగాదేవి ఆ వార్త

విని అచ్చటికి వెళ్ళి వచ్చుటకు తహతహ లాడుచుండెను. ఒకరోజు వూరి వారు ఆ దారిన వెళ్ళుచూ వారిని చూచి "అమ్మా మీరు ఎన్ని రోజులు ఇట్లు బాధపడెదరు. మీ గ్రామస్తులు మిమ్ములను హీనముగా చూచుటయే గాక మిమ్ము నిందించుచున్నారు గదా! మీ తల్లి దండ్రులు కూడ మిమ్ములను ఆదరించక ఊరి బయట పెట్టి నీచముగా చూచుచున్నారే! కావున నీవు ఈ రోగిని విడిచి మీ తల్లిదండ్రులను చేరిన వారు మరి యొక వివాహము చేయుదురు. అందులకైనను నీవు పూనుకొని హాయిగా ఉండ వచ్చు గదా" యని వారనగా ఆమాటలు విన్నట్టి బ్రాహ్మణి మిగుల దుఃఖించి "అన్నలారా! మీకు వందనములు చేసి చెప్పుచున్నాను. నన్ను ఇటు వంటి మాటలతో బాధించుట భావ్యము గాదు. నాతల్లియైన ఆదిపరాశక్తి నాపాలిట ఉన్నంత వరకు నేను యెట్టి బాధల కును గురికాను. నా భర్తను విడిచి తల్లి, దండ్రి చెంతకు గాని మా అత్త మామల వద్దకు గాని వెళ్ళను. ఈనాటికి నా అత్త మామలు మమ్ములను పలుకరించక యున్నారు. వారి మాటలు నేనెంచక నా పాలిట భగవంతుడే దిక్కని ఆ సర్వేశ్వరుని నమ్మియు న్నాను. నా మీద ఎప్పుడు దయగలుగునో అంతవరకు నా బాధ నేనే పడుదునేగాని వేరు మార్గమునకు పోనని, అటు ప్రవర్తించియుండిన మా వూరివారే నా వ్రతమును చెరుపుటకు కూడ సిద్ధపడెదరు." అని చెప్పెను

ఇట్లుండ ఒక నాడు ఒక వృద్ధురాలు రతిమన్మధుల వలే నున్నట్టి భార్య భర్తల దుఃఖమును గాంచి వారి చెంతకు వెళ్ళి వారిని విచారించెను, వారు తమ వివాహమై నప్పటి నుండి తాము పడుచున్న బాధలను సవిస్తరముగా తెలియబరచగ ఆ వార్త విన్నట్టి వృద్ధురాలు జాలిపడి వాంతో దేవగిరి గ్రామమందున్నట్టి గంగాభవానీ యొక్క ప్రభావములు చెప్పి అచ్చటికి వెళ్ళినవారు వ్యాధి ఖచ్చితముగా నయమగునని హిత బోధచేసెను. అందులకు వారు "అవ్వా! మాకు మార్గము తెలియక యెన్నో రోజు లుగా మా గ్రామస్తులను ఎంత బ్రతిమాలినను మా చెంతకు వచ్చుటకు అసహ్యపడి, దగ్గరకు రానివారై నిందించుచున్నారు. మరి మాకు దిక్కెవ్వరు అని దుఃఖింపగా చూచి వృద్ధురాలు జాలిపడి అప్పటికప్పుడే వారిని వెంట నిడుకొని దేవగిరి గ్రామము నకు బయలుదేరినది.

వృద్ధురాలి రూపమున ఉన్నట్టి అమ్మ బ్రాహ్మణ దంపతులను వెంట నిడుకొని దేవగిరి గ్రామము చేరి గంగా భవానీ నివాసము చెంతకు వెళ్ళగా, గంగాదేవి మౌన నిష్ఠలో కూర్చుని యుండెను. బ్రాహ్మణ దంపతులకు ఆమెను చూపి వృద్ధురాలు వెనకకు మరలెను. అప్పుడు వారు ముందుకు వెళ్ళి వెనుక చూడ వృద్ధురాలు అగు

పడదాయెను. ఆ బ్రాహ్మణ బాలిక పరిసర ప్రాంతమంతయు పరికించగా వృద్ధురాలి జాడ ఏమాత్రము తెలియలేదు. అంతలో గంగాదేవి మౌననిష్ఠ విరమించి కన్నులు తెరచి వారి వంక చూడ ఆ దంపతులు ఆమె పాదములపై బడిరి. బ్రాహ్మణ యువతి ఆ దేవితో "తల్లీ నాకు పతిభిక్ష పెట్టుము. అని అనేక విధములుగా వేడుకొని పాదములపై నుండి లేవకుండెను.

బ్రాహ్మణ దంపతుల దుఃఖమును చూచినట్టి గంగాభవానికి వారిపై జాలి చూపి కమండల మందలి నీటిని కొంత తీసుకొని మంత్రోపచారము చేసి ఆ నీటిని బ్రాహ్మణ యువకునిపై చల్లను. ఆ బ్రాహ్మణ యువకుని శరీరమంతయు చీము రక్తములతో నిండి కంపు కొట్టుచూ సహించలేని దుర్వాసనతో నిండి యుండెను. అంతనామె అతని దేహమును స్వయముగా శుభ్రపరచి మంత్రోపచారము చేసినట్టి నీటిని చల్లి అతనిని ఏడురోజులు తన చెంతనే నిలుపుకొని అతని కుష్ఠురోగమును మాన్పి అతని ఆరోగ్యము చక్కబెట్టెను. అంతట బ్రాహ్మణ దంపతులు ఆమెను అనేక విధములుగా సేవించుచూ అచ్చట కొంతకాలము ఉండి వారి నివాసమునకు వెళ్ళిరి.

ఆమె ప్రవర్తన గాంచినట్టి ఆ గ్రామ ప్రజలు అమితానందభరితులై కడు ప్రీతితో గౌరవించగా అది యంతయు గమనించినట్టి గంగాదేవి వారితో "నాయసలారా! నేను దేవతాస్త్రీ కాను. నేను చేయు భక్తి భావముల వలన ఆ దేవి నన్ను కనికరించి ఇట్టి ప్రభావములు ప్రసాధించి కాపాడుచున్నది; కావున మీరున్ను నావలెనే జాతి, మత బేధములు లేక భక్తిశ్రద్ధలతో నడచినవారికి దైవసహాయము తప్పక కలుగునని" చెప్పెను. తర్వాత కొన్ని దినములకు దేవగిరి విడచి దక్షిణ ప్రాంతమునకు దేశాటనకై వెళ్ళెను, అచ్చట నుండి వేరు ప్రాంతమునకు వెళ్ళుచుండగా ఒకానొక దేశమున మహ్మదీయులు విపరీతముగా దాడులు జరుపుచుండుటయు అక్కడ వున్న హైందవులు భయభ్రాంతులై దిక్కుతోచక యుండిరి. ఆ విషయము గ్రహించిన దేవి ఆగ్రహురాలై ఆ గ్రామ వాసులతో "బిడ్డలారా! మీరు యేమి భయము జెందవలదు. సృష్టిలయ కారకురాలగు ఆదిపరాశక్తి యైనట్టి జగజ్జనని మదియందు తలంపు జేయుట వలన మీ పాపములు హరించి, కష్టంబులు తొలుగునని అంత వరకు శాంత స్వభావులై యుండిన మహ్మదీయుల గర్వమనుచు సమయము వచ్చునని" చెప్పెను. ఆ విధముగా హామీ యిచ్చి ఆ ప్రాంతము వదలి ముందుకు సాగెను.

యేలగిరి కొండప్రాంతము నందు దొరలు, బోయలు అనేకులు కోటప్రాకార

ములు భవనములు నిర్మించుకొని యుండిరి. అట్టి నివాసుల చెంతకు వచ్చి వారి భక్తి భావములను చూచి ముగ్ధురాలై వారికి అండగా వుండదలచి అక్కడ నివాసమేర్పరచు కొని స్నానమాచరించుటకు ఒక సరోవరమును సృష్టించెను. కానీ ఆ సరోవరము పూర్తిగా రాతియందే ఇమిడి యుండెను.

అచ్చట అమ్మవారు అనేకమగు మహిమలు చూపుచుండెను. అక్కడ వున్న దొరలు, బోయలు ఆమెను మిక్కిలి భక్తిశ్రద్ధలతో కొలిచి ఏటేట జాతరలు చేయు చుండ అమ్మవారు వారి కష్టంబులను గమనించి తలచినంత నే వారికి ప్రత్యక్షమై వారి కోరికలు తీర్చుచుండెను. కొల్దది దినంబులకు ఆ ప్రాంతమున పాడిపంటలు నశించి పశువులకు మేత లేక వ్యాధులతో మరణించుచుండగా అక్కడి వారు భయభ్రాంతులై పాలేటమ్మ చెంతకు వెళ్ళి ఆమెను సేవించి ధూపదీపనైవేద్యము లిచ్చి మొక్కులు తీర్చుకొనిరి. అంతట గంగాదేవి రూపమున ఉన్నట్టి పాలేటమ్మవారు కనికరించి వారికి యే ఆపదలు రానివ్వనని అచ్చట నివాసస్థులకు అభయమిచ్చెను ఆమె వారు కష్టమందు ఉన్నప్పుడు పిలిచిన తోడనే అదృశ్యరూపమున వారితో మాటాడుచుండెను. ఆ విధ ముగా వారికి మాట యిచ్చిన మేరకు వారి గ్రామముల యందు యే ఆపదలు రానీక పాడిపంటలతో అభివృద్ధి పొందించి ఎట్టి వ్యాధులు రానీయక సుభిక్షితము చేసెను. ఆనాటి నుండి ఆ గ్రామాదులందుండు దొరలు బోయలు అచ్చట ఆలయము నిర్మించి ఆమె కెదురుగా వుండు సరోవరము చుట్టూ శుభ్రపరచి ఆమెను కొలుచుచూ నమ్మి కొని యుండిరి.

గంగాదేవికి అచ్చట ఉన్నట్టి ప్రకృతి సౌందర్యము ఆహ్లాదకరము గొల్పుతు అగుపడెను. ఆ ప్రదేశము పర్వతశ్రేణులచే అలంకరింపబడి అతి మధురమగు ఫల పుష్పభరితమైన వృక్షములచే జాజి, పొన్న చామంతి మొదలైన సుగంధ కుసుమ లతలచేతను శుకపిక మయూరాది పక్షుల సమూహముల చేతను కురంగసారంగాది మృగములచేతను విరాజిల్లు చుండెను. ఆ ప్రదేశము ప్రశాంత వాతావరణముతో మనోహరమై కొండకోనలతో వింత దృశ్యములతో నిగిడీకృతమై అతిమనోహరమై సర్వ సంపదలచే నలరారుచున్నట్టి ఆ యాదగిరి శిఖర ప్రాంతమందు నివసించ వలెనని యెంచి అచ్చట నిలిచెను. మహమ్మదీయుల దాడులు దక్షిణ ప్రాంతమునందు విపరీత ముగా పెరగకుండా ఆపెను.

అటుల ఆమె దక్షిణ ప్రాంతమును సంచరించుచూ ఒక కాపుపల్లె చేరునప్పటికి ఆ గ్రామపెద్దలందరు కలిసి వారి ఇబ్బందుల నివారణార్థమై కనకదుర్గమ్మ యొక్క

జాతర చేయబూనుకొని ఆ వూరిలో చందాలు వసూలు చేయుటకు మాట్లాడు చుండిరి. ఆ సమయంబున గంగాదేవి అచ్చటికి వెళ్ళగా వారు ఆమెను చూచి "అమ్మా! నీవెవరు? నీదేవూరు? నీ నామదేయంబేమి?" అని అడుగ అందులకు గంగాభవాని రూపములో ఉన్న అమ్మవారు "నాయనా! నాది ఒక వూరు అని లేదు. నేను అంతట తిరుగు చుందును. ఏ పేరుతోనైనా నన్ను పిలువవచ్చును." అని వారితో చెప్పెను. ఆ మాటలు విన్నవారు ఈమె యెవరో మతి భ్రమించిన దానివలె కనబడుచున్నది. రూపురేఖ లావణ్యము చూడ ముచ్చటగా ఉన్నవి. కానీ ఆమె యొక్క కర్మ ఆ విధముగా ఉన్నదని యెంచి ఇట్టి దిక్కులేని వారికి ఆశ్రియమిచ్చుట వలన మనకు మంచి దని భావించి ఆమెతో "అమ్మా నిన్ను జూడ మాకు జాలికలుగుచున్నది. కావున నీవు మా వూరిలో మా సోదరివలె ఉండుమని" చెప్పి గ్రామ ఆలయము ప్రక్కన ఉన్నగది యందు నివాసమేర్పరచిరి. కావలసిన సౌకర్యములు యేర్పాటు చేసిరి. అటుల గంగాదేవి కాలము గడుపుచుండ జాతర చేయు సమయమున అసన్నమాయెను. వారు దానికి కావలసిన సామాగ్రి అంతయు సిద్ధపరచుకొనిరి ఆ మరుసటిరోజు వారు వారి ఇంటి పనులు చూచుకొని అనేక రకముల వాయిద్యములతో వేడుకలతో దుర్గాదేవి ఆలయమునకు బయలుదేరి అమ్మ చెంత పూజలుచేసి ధూపదీపనైవేద్యముల నిచ్చి సంతోష పరచిరి. ఆ సమయంబున ప్రక్కపల్లెల నుండి నల్లమందు శబ్దములు వినపడి మరి కొంత సేపటికి కేకలు అరుపులు విపరీతముగా వినబడెను అదివిని జాతర జరుపుచున్న వారు భయకంపితులై అటు, ఇటు పరిగెత్తసాగిరి. ఆ ప్రాంతమునకు గుఱ్ఱములపై వేగముగా వచ్చిన తురుష్కులు జాతర యందుండు వారిని చుట్టడించి అక్కడ వున్నట్టి హైందవులను ఘోరముగా హింసింప ప్రారంభించిరి. ఆలయము ప్రక్కగదిలో వున్న గంగాదేవి యిదిచూచి కోపోద్రిక్తురాలయ్యెను.

ఆ సమయమున వారు అమ్మవారి ఆలయమును పడగొట్టి అక్కడ ఉన్న కానుకలను అమ్మవారి విగ్రహములను అపహరించుకొని జాతరకు వచ్చి యున్నట్టి స్త్రీల కంఠములందు వున్న బంగారు నగలను తెంచుకొనుచు వారికి అడ్డము వచ్చిన వారిని చంపుచూ స్త్రీలను చెఱబట్టుచుండిరి అట్టి సమయమున ఆలయము చాటున ఉన్నట్టి గంగాభవానిని చూచిన నవాబు అశ్వమును ఆమె చెంతకు త్రిప్పి మోహాంధకార పరవశుడై ఆమెను చెఱబట్టుటకు ముందుకుపోయి చెయ్యిచాప దొరబిడ్డలు, బోయబిడ్డలు అదిగాంచి మన గంగాదేవిని చెఱపట్ట పోవుచున్నాడని యెంచి కోపోద్రిక్తులై మహ్మదీయులను ఎదిరించి వారిపైకి దాడి సలిపి ధైర్యముగా పోరాడి గంగాదేవిని తప్పించిరి. అప్పటికి అమ్మవారు శాంతించినది. కాని వారి దుండగములు పెచ్చుపెరిగి వారు

హిందువులను చిత్రహింసలు చేయుచుండిరి. అది గాంచిన గంగాదేవి రూపమున ఉన్న అమ్మవారు సహించక కోపోద్రిక్తురాలై ఖడ్గమును చేతబట్టి ఫిరంగుల సయితము లెక్కచేయక ముందుకు వెళ్ళి మహ్మదీయులను నాశన మొనరింప మొదలిడెను గంగాదేవి ధాటికి వారు తాళలేక ఎక్కడి వారక్కడ పరుగెత్తుట మొదలిడిరి. ఆ సమయమున గంగాదేవి ఆ గ్రామస్థులందరిని దగ్గరకు పిలవగా వారిట్లు స్తుతించిరి "అమ్మా జగత్ రక్షకీ అసుర వీరుల సైతము జయించునట్టి ఓ శక్తి స్వరూపిణీ! మా తప్పులు మన్నించి మా యందు కృప జూపవే ఓ అంబా! లోకకటాక్షిణీ! నీ పాదరవింద సేవ నిత్యము ఒనరింతుమే! ఓ ఆదిశక్తి! ఈ రూపంబున అరుదెంచి మమ్ము కాపాడినట్టి ఓ తల్లీ! నిన్ను వేయి విధంబుల స్తుతించి వేడెదము జననీ! మాపై కనికరించి యెల్లపుడు కాపాడవే అని అనేక విధములుగా అమ్మవారిని వేడుకొనగా వారి ప్రార్థనలు విన్నట్టి భవాని వారిని దీవించి ఓ నాయనలారా! నేను మానవురాలినే! కాని దేవతాస్త్రీని కాదు. మీరు నా గురించి ప్రాణముల సైతము లెక్కచేయక ముందుకు వచ్చినందున సృష్టికి మూలకర్తయగు ఆదిశక్తి ప్రసాదముచే వారిని జయింపగలిగితినే కాని మరియే శక్తియు లేదు. కనుక మీకు ఈ నాటి నుండి నేనెక్కడ ఉన్నను. యేభయము లేక నిర్భయముగా కాలము గడుపుకొన గలదానను ఇక నేను వేరే ప్రాంతములకు పోవుచున్నాను. అని వారితో చెప్పెను

ఆ మాటలు విన్నట్టి గ్రామస్థులందరు ముక్తకంఠముతో తల్లీ మమ్ములను మహ్మదీయుల బారినుండి కాపాడి మా భీతిని పోగొట్టి ఎంతెంతో సహాయములు చేసి యిప్పుడు యిలా అర్ధాంతరంగా వెళ్ళుట సమంజసము కాదు. అని అనేక విధములుగా బ్రతిమాలగా దేవదేవియైనట్టి ఆ గంగాదేవి వారికి ఓదార్చి జరుగబోవు కాలములో వారికి తోడునీడై వారి యభీష్టంబులను తీర్చెదనని చెప్పి దీవించి వారినుండి సెలవు గైకొని అచ్చట నుండి ప్రయాణమయ్యెను.

గంగాభవానీ ధాటికి తాళలేక తప్పించుకొన్న మహ్మదీయులు చాటు మాటుగా రాజధాని యగు గోల్కొండ చేరి నవాబుకు తమ బాధ యెరిగింపగా అతడు మండిపడ అమితమైన కోపముతో అనుచరులను అనేక విధములుగా నిందించి ఆ దొరబిడ్డలెంత? బోయలెంత? వారి నందరిని నల్లమందుతో ఒక్కసారిగా హతమార్చలేక పిరికి పందల వలే తిరిగి వచ్చి చెప్పుటకు సిగ్గులేదా, ఇచ్చటికి వచ్చుట కంటె అచ్చటనే మరణించియున్న యెడల యే బాధయు ఉండదని అనేక విధములుగా వారిని దూషించి తానే స్వయముగా దక్షిణ ప్రాంతములకు దండయాత్రకు బయలుదేరుటకు సర్వ

సన్నద్ధుడాయెను. నేటి నుండి ఈ దేశమున ఎక్కడైనను దొరబిడ్డలు, బోయలు కన పడిన వారిని నిర్మూలము చేయుదునని శపథము చేసి పండ్రెండు లక్షల సైన్యముతో నవాబు దక్షిణ ప్రాంతములకు బయలుదేరి వచ్చి దొరలను, బోయలను కనిపెట్టి తిరుగుచూ దౌర్జన్యములను ప్రారంభించ సాగెను.

ముందువలె మహ్మదీయులు దక్షిణప్రాంతమున చేరి విపరీతమైన దుండగములు చేయుచుండగా అది చూచినట్టి దొరబిడ్డలు, వాల్మీకులు అందరు ఒక్కచోట చేరి ఒక్కరితో ఒక్కరు మనమందరము ఒక్కటిగా చేరి వున్నయెడల మహ్మదీయులకు ఎదిరించుట సులభమని లేనియెడల కష్టతరమని వారిలో వారు తర్కించుకొనిరి.

అటువంటి సమయమున అన్ని సామర్థ్యములు గలిగి బుద్ధిమంతుడు అధిపతియై వచ్చిన మహ్మదీయ నాయకుడు దొరల, బోయల జాడలు తెలిసికొనుటకు కొందరు గూఢాచారులను నియమించెను. వారు అన్ని ప్రదేశముల యందు మారు వేషములతో తిరుగుచూ వారి శత్రువుల జాడలు తెలిసికొనుచుండిరి. ఇట్లుండ ఒకనాడు అర్ధరాత్రి సమయమునందు మహ్మదీయులు దొరబిడ్డల, బోయబిడ్డల స్థావరముల చెంతకు వెళ్ళి ఆకస్మాత్తుగా వారిపై బడిరి. అప్పుడు వారందరు దిగ్గునలేచి చూడ తుపాకులతో సిద్ధముగా నున్న మహ్మదీయులు కనపడిరి. అదిచూచి వారు భయందోళన చెంది ఎటు పోవుటకు దిక్కుతోచక ధైర్యముగా వారితో పోరాడసాగిరి. అయిననూ మహ్మదీయుల యొద్ద తుపాకులు నల్లిమందు వున్నందువలన వారి ఆటలు సాగవని యెంచి తప్పించుకొని అరణ్యముల పాలైరి. ఆ సమయమున ఆ గ్రామములందు తల్లిగాని పిల్లగాని లేరు ధనవంతులు బీదలు అని తారతమ్యము లేక వారి సంపదంతయు ఆ తురష్కులు స్వాధీనము చేసుకొనిరి. అచ్చటచ్చట ఘోర కృత్యములు చేయుచున్నను వారికి యెవ్వరు ఎదురు చెప్పలేదు. ఆ ప్రాంతమంతయు చూచుటకు భయంకరముగా నుండెను.

ఆ సమయమున తప్పించుకొన్నట్టి దొరలు, బోయలు పల్లె, పట్టణము లందు మనమున్న యెడల శత్రువుల వలన ప్రాణహాని జరుగునని యెంచి అరణ్య ప్రాంతములకు వట్టి చేతులతో వెళ్ళి దేవగిరి శిఖరముపై చేరిరి. ఆ పరిసర ప్రాంతములకు వారందరు వృద్ధులతో సహితము అచ్చటికే వచ్చిరి. అటు కొండపై ఉండుటకు నివాసము లేనందున అచ్చట గల కొండగుహల యందును, చెట్టు తొర్రల యందును పెద్ద గుండ్ల క్రిందను నివాసమేర్పరచుకొని జీవనములు గడుపుచు వేళకు ఆహారము

లేనందున అరణ్యమునగల ఆకులు, అలములు, గడ్డలు, తేనెలు, పండ్లు, కందమూలాదులను భుజించి జీవనము గడుపుచుండిరి.

ఆ సమయంబున అమ్మవారు చాలా రోజులుగా దేశాటనచేసి కొన్ని రోజులు విశ్రాంతిగా ఉండదలచి పల్లె పట్టణప్రాంతముల యందుండుటకు సరిపడనందున యేదేనొక గొప్ప అరణ్యము చేరదలచి దేవగిరి శిఖరముచేరి ఆ ప్రదేశము పరికించగానందు మానవసంచారము కనపడెను. అక్కడ దొరలు బోయలు తిరుగాడుచుండిరి వారిని గాంచిన అమ్మవారు వీరే నా బిడ్డలు నా కొరకు చాలా బాధపడి ఇట్టియవస్థ తెచ్చుకొని ఈ అరణ్యమందు తిండిలేక బాధపడుచున్నారని గ్రహించి వారికి తోడుపడ నిశ్చయించి నివాసమునకు తగుస్థలము ఎచ్చట బాగుండునని శిఖరమంతయు వెదకగా అచ్చట ఒక పేటు మధ్యబయలు చూచి అక్కడ స్థిరపడదలచుకొనెను. ఒక బండరాతిలో నీటిని పుట్టించి స్నానమాచరించి, ఒక వెఱ్ఱి ఆముదము చెట్టుక్రింద తపోనిష్ఠ మొదలిడెను.

తపోనిష్ఠలో అమ్మవారు కొంతకాలము గడపి యోగనిష్ఠ విరమించిలేచి నాల్గు ప్రక్కల పరికించి చూడగా దక్షిణప్రాంతమున ఘాత్రము ఇంకనూ తురష్కుల దుండగములు తగ్గక పెరిగిపోవుచుండెను. ఆ ప్రాంతమంతయు వారి వశమైనందున అక్కడ వున్న బోయలు, దొరల సైతము దేవగిరి శిఖరములపైకి వచ్చి చేరుకొన సాగిరి. ఇట్టి బాధలను చూచిన అమ్మవారు "ఔరా! సాటి మానవునకు మానవుడే భయపడు కాలము వచ్చెనే? వీరినందరిని సృష్టించినదికూడ నేనే! నాకందరు సమానులేనే! వీరికి ఏవిధముగా బుద్ధి చెప్పవలెనో" యని యెంచి బాధితులను చూచి జాలినొంది తెలుగువారిని రక్షింపదలచెను.

ఒకనాడు అమ్మవారు దివ్యదృష్టితో నాల్గుదిశల యందును శిఖరముపై నుండి పరికించగా అక్కడక్కడ దొరలు బోయలు దిగువనున్న అరణ్యమందు గుహల యందు చెట్లతొఱ్ఱల యందును పెద్ద పెద్ద గుండ్ల క్రిందను నివాసము చేయుట కనిపించెను. అదికని అమ్మవారు "అయ్యో నా బిడ్డలకు యెట్టి దురవస్థ వచ్చెనే అని బాధజెంది వీరికి స్థిరనివాసములు యేర్పరచవలెనని దలచి వారి చెంతకు పోదలచెను. ఒక వృద్ధురాలు రూపము ధరించి వారందు నివాసముల చెంతకు వెళ్ళి వారికి చెప్పవలసినవి చెప్పి ఓదార్చి త్వరలో మంచి కాలము రానున్నదని హితవు చెప్పెను. వారందరు అవ్వ మాటలు ఆలకించి అవ్వచెప్పిన తీరుగా ఆ కొండ శిఖరముపై వున్న విశాల ప్రదేశముచేరి మహ్మదీయులు అంతమైనంత వరకు అచ్చటనే నిలచి స్థావరములు

గట్టిగా ఏర్పరచదలచిరి. అందరు వారికి తోచిన విధముగా కుటీరములను ఏర్పరచు కొని జీవనములు గడుపుచు అవ్వ సలహాను గుర్తించుచూ ఆహారంబునకుగాను ఆ అరణ్యమందు గడ్డలు, ఫలములు, తేనెలు, తెచ్చుకొని అవ్వకు ఇచ్చి తామును భుజించి కాలము గడుపుచుండిరి.

ఒకరోజు ఆ గూడెము వారందరున్ను వినోదముగా వెన్నెలలో అవ్వను కూడా అచ్చటికి పిలిచి అషామాషీగా మాటాడునపుడు కొందరు అవ్వను చూచి "అవ్వా మాకు చాలారోజులుగా నీతో కొన్ని విషయములు మాట్లాడదలచి వ్యవధి లేక పూరకుంటిమి ఆ అవకాశము మాకు ఈనాటికి కల్గినది మాసంశయము తీర్చవలసినదని ప్రార్థించగా అందులకు అవ్వరూపముందున్న అమ్మ "నాయనలారా మీరు నన్ను అడగవలచినది అడగండి నాకే అభ్యంతరములేదు నేను మీతల్లిలాంటి దానను మీరు నాకు బిడ్డలు లాంటి వారు అని చెప్పగా అందులకు వారు "అవ్వా ఇన్నిరోజులుగా నీవు మా చెంత వున్నావే! నీకు ఇంకెవరైనా బంధువులు ఉన్నారా? మీది సొంత వూరు యేది? బిడ్డ లెందరని అడిగగా ఆ మాటలు విన్నట్టి అవ్వ నవ్వి నాయనలారా ఆ విషయమడుగు టకు సంసయమెందులకు? చెప్పెదను. కానీ ముందు మీరు ఎందులకు పల్లె పట్టణములు విడచి ఈ అరణ్యముచేరి ఆకులలుములు తిని కాలము గడపెదరు? మీ నివాసము లేవి? చెప్పండి? అని ప్రశ్నించెను. ఆ మాటలు విన్న దొరలు బోయలు నివ్వెరపోయి అవ్వ పెద్దదైనందున సూటిగా చెప్పెనని ఆమెతో మారుపలుకక ఊరక యుండిరి.

అప్పుడు అవ్వ వారితో "నాయలారా! మీగతియే మా గ్రామస్తులకునూ పట్టినవి. మహ్మాదీయుల హింసలకు తాళలేక అడవులపాలై వయస్సులో ఉన్నవారందరు కాళ్ళ సత్తువమేరకు వారికి తోచినట్టు పారిపోగా మిగిలిన మా ట్టోటివారు నడువలేక అచ్చట వుండుటకు సరిపడక దారితెలియక ఈ అరణ్యములోనికి వచ్చుసరికి చీకటి పడినది. మీరు ఎదురైనందున అందరు ఒకచోట చేరితిమి. మీరు లేని యెడల ఈ అరణ్యము లోనే నెక్కడెక్కడ ప్రయాసపడవలసి వచ్చునో! మీ చెంత వుండుట వలన మనబిడ్డల చెంత ఉన్నాననుకొని ధైర్యము తెచ్చుకొని సంతోషముగానున్నాను అని చెప్పెను. అంతట వారు అవ్వచెప్పిన మాటలన్నియు నిజమని యెంచి ఆ నాటినుండి అవ్వపై భక్తి విశ్వాసములు నిలిపి ఆమెను ఎక్కువ గౌరవముతో చూచుకొనుచుండిరి.

ఆ ఎత్తయిన శిఖరముపై నివాసమున్నట్టివారు ఒకనాడు ఆ ప్రదేశము నుండి చుట్టు ప్రక్కల తిలకించుచుండ వారికి మహ్మాదీయులు దండయాత్రల శబ్దములు

వినవచ్చెను. ఎత్తుప్రదేశమున ఉండుటవలన ఆ చుట్టు జరుగు ఘోర దృశ్యము గోచరమయ్యెను. తామింట్లుడిన ప్రాణహాని తప్పదని తమకెన్ని ఆయుధములున్నను వారి నల్లమందు తుపాకుల ముందు యేమాత్రము నిల్వలేమని యెంచి అందరును ఒకచోట చేరి అవ్వను కూడా పిలిపించి మహ్మదీయుల దండయాత్రలు గూర్చి చర్చింపసాగిరి. ఒక్కరు గాని మంచి ఆలోచన చెప్పరైరి అది చూచిన అవ్వ వారితో "నాయనలారా నేనొక్క ఆలోచన చెప్పెద ఏమనగా! మన శత్రువులైనట్టి మహ్మదీయులను హతమార్చవలెనన్న మన ఆయుధములు వారి ముందు యేమి చేయజాలవు అందుకని మన మొక్కటి ఆలోచింపవలెను. యే విధము చేతనైనను వారిని మోసపుచ్చి కొంత నల్లమందు తుపాకులను సంపాదించిన యే భయము ఉండదనెను.

అమ్మరూపముతో ఉన్నట్టి అవ్వమాటలు విన్నదొరలు బోయలు ఆ ఉపాయమును గూడా అవ్వనే చెప్పమని కోరిరి. అందులకు అవ్వవారిని చెంతకు పిలిచి "బిడ్డలారా! మీకొక ఉపాయము చెప్పెద మీలో సాహసవంతులు కొంతమంది మహ్మదీయుల వేషము ధరించి వారిలోచేరి గూఢాచారులై వారి రహస్యములు తెలిసికొని చేతికందిన నల్లమందు తుపాకులు తీసుకొని వచ్చి ఇచ్చట ప్రోగుచేయుట మంచిదనెను" అందులో ఒక్కడు అవ్వనుచూచి అవ్వా మేము యెంత మహ్మదీయవేషము ధరించినను మాలో ఏ ఒక్కరినైనను వారు గుర్తుపట్టిన మా అందరి ప్రాణములేకాక ఇక్కడ వున్నవారు కూడా పట్టుబడెదరని చెప్పగా అవ్వ నవ్వి "నాయనా మీకు అలాంటి భయము వలదు మీరు సిద్ధముగా వున్న ఆ ఏర్పాట్లు నేను చేయుదునని" చెప్పెను. అంతట వారిలో కొందరు ఆ తల్లి సలహామేరకు మహ్మదీయవేషము ధరించి అవ్వ నివాసము చెంతకు వెళ్ళిరి. వారిరాక యెరింగినట్టి అవ్వదగ్గరకు పిలిచి మంత్రోపచారము చేసినట్టి బండారువిభూతిని చేతికిచ్చి కొంతవారి శిరముపై చల్లి వారిని దీవించి ఈ విధముగా చెప్పెను. మీరు ఏ పరిస్థితుల యందుగాని బండారు విభూతిని వదలక దగ్గరుంచుకొన్న యెడల శత్రువుల నుండి భీతిలేక మహ్మదీయుల రూపములతోనే వారి చెంత ఉండెదరని చెప్పగా వారందరు అమితానంద భరితులై అవ్వను అనేక విధములుగా పొగడి నమస్కరించి ఆమె దీవెనలందుకొని సెలవు తీసుకొని వెళ్ళిరి.

ఆ విధముగా వారు మహ్మదీయుల స్థావరముల చెంతకు వెళ్ళి పూరు రూపములతో వారితోకలిసి మెలగుచుండ యెవ్వరున్ను గుర్తుపట్టరైరి. వీలు చూచుకొని వారు అప్పుడప్పుడు రహస్యముగా యుద్ధసామాగ్రిని నల్లమందును తీసుకొని నిల్వచేసుకొనుచుండిరి. వారు విభూతి బండారు ధరించి వెళ్ళుట వలన వారికి యే ఆపదలు రానందున

అవ్వ యొక్క మహిమలు సూఛాయగా వారిలో కొందరికి గోచరముకానవచ్చెను. ఒకా నొక దినంబున అవ్వలేని సమయమందు ఆ గూడెము వారందరు ఒకచోటచేరి అవ్వను గూర్చి చర్చించి వారిలోవారే అవ్వ సామాన్యురాలుకాదని ప్రాణములు కాపాడుటకు మనపాలిటి దేవతయే ఈ రూపమున మనచెంత ఉన్నది. అవ్వరాక ముందు ఎన్నియో బాధలు పడుచుంటిమి అవ్వ చేరినప్పటినుండి మనకు కలుగునట్టి మేలుచూడ తిండి బాధలుగాని, మనోబాధలుగాని గోచరముకాక మనమున్న ప్రదేశము ప్రశాంతముగ నున్నది. అదియుగాక అవ్వ యే సలహా ఇచ్చినను ముఖము చూచి వెళ్ళినను మనము చేయు కార్యములు తప్పక జయప్రదముగా జరుగుచున్నవి. అపజయము మాత్రము లేదని తలంచిరి. అప్పటినుండి మునుపటికంటే ఎక్కువ గౌరవముతో ఆమె మాటలు జవదాటక ప్రవర్తించుచుండిరి.

ఒకనాటి ఉదయమున అవ్వ గూడెమందున్న వారిని ఒకచోట చేర్చి వారికి జయభక్తులుండునట్లు చేయనెంచి నాయనలారా నేను చెప్పునట్టి దానిని శ్రద్ధతో ఆల కించుడు మనము మొట్టమొదట అనేక బాధలు పడుచుంటిమి ఇప్పుడు ఆ బాధలు తొలగి నెమ్మదిగా కాలము గడుపుకొనుచున్నాము. కానీ మనము ముందువలేగాక భక్తిభావములు మరచియున్నాము. ఇప్పుడు మనదైవభక్తి చూపవలెనని చెప్పగా అందులకు వారు సమ్మతించిరి. అప్పుడు వారితో అవ్వ నాయనలారా! మనమిచ్చట ఉండుటకు కారణము ఒక్కటి ఏమనగా మనస్థావరముల క్రింది భాగము ఒకపేటుకు నడుమ సర్వసృష్టి లయకారకురాలగు ఆదిపరాశక్తి నిలయమైయుండుట వలన మనము ఎట్టి బాధలులేక శత్రుభయములేక యేపని చేసినను నెరవేరుచున్నది. కానీ ఇంతవరకున్నూ ఆమెను తలంపలేదు ఎందులకు? ఇంతక మునుపు తెలియనందుననే ఆమె పూజచేయలేదు. ఇప్పుడైనను మనము అచ్చోటికి వెళ్ళి ఆమె నిలయము కనుగొని కొలుచుట మంచిది. ముందు జరగబోవు ఆపదలను తొలగించగల శక్తి ఆమెలో ఉన్నదని వారికి చెప్పెను.

అందులకు వారు ఆశ్చర్యపడి అవ్వా ఈ విషయము ఇంతకమునుపు ఎప్పుడై నను మాతోచెప్పక ఇప్పుడు చెప్పుటకు నీకెట్లు తెలియవచ్చెనని అడిగిరి అప్పుడు అవ్వ నాయనలారా అక్కడ ఆదిశక్తివున్న విషయము నీకెట్లు గోచరమైనదని అడుగు చున్నారు. చెప్పెద వినుడు ఒకనాటి రాత్రి స్వప్నమందు ఒక నవ యవ్వనస్త్రీ కన బడి అవ్వా నీవు పెద్దదానవైనందున యేమి ఫలము? నీవైనను గూడెము వారికి నేను ఇచ్చట వున్నట్టు చెప్పి వారిచే నాకు ఆలయము కట్టించి నన్ను సేవించిన మీకు మొట్ట మొదట చూపిన మేలుకన్నను ఎక్కువ చూపి మీ బాధలు తీర్చి మీ ప్రాంతములకు

వెళ్ళులాగున చేయుడునని చెప్పి అంతరానమయ్యేను అనెను.

ఆ విధముగా అవ్వ వారికి స్వప్న విషయమును చెప్పి నాయనలారా! ఈ విషయము ముందు చెప్పలేదంటిరే ఎందులకనగా ఇది నిజమా! అబద్ధమా యని మనస్సుకురాక వూరకుంటిని. ఈ స్వప్నము రోజూ వచ్చుట వలన చెప్పకుండుట బాగుండదని ఈ రోజు మీతో చెప్పుచున్నాను అనగా అదియంతయు విన్న బోయలు దొరబిడ్డలు అవ్వ చెప్పుమాట యధార్థముగా జరుగుచున్నవి. స్వప్న విషయము చెప్ప లేదని యెంచి అవ్వ పాదములపైబడి నమస్కరించి అవ్వా నీ ఆలోచనలు మనందర కును మేలు కలుగచేయుచున్నవే గానీ ఇంతవరకు కీడు వాటిల్లలేదని చెప్పి ఆనంద భరితులై అప్పటికప్పుడే గూడెము వారందరు పేటు వద్దకు ప్రయాణమైరి.

అచ్చట నుండి అవ్వను వారు వెంటనిడుకొని శిఖరము క్రిందగల పేటువద్దకు వచ్చి ఆ ప్రదేశమంతయు పరికించగా పేటు మధ్యభాగమున ఒకచోట వెర్రి ఆముదపు చెట్టు అగుపడెను ఆ ప్రదేశము సుగంధద్రవ్యముల వాసనతో నిండి పసుపుకుంకుమ మరకలు కనపడెను. అచ్చట వెదకుచున్న వారందరు ఆదృశ్యమును తిలకించగా అందు ధూపదీపనైవేద్యములు కర్పూరహారతులు ఇచ్చినట్టి గుర్తులు అగుపడెను. అది గాంచి వారందరు ఆశ్చర్యము జెందుచు ముందుకు నడవగా పొదలచెట్లు చాటున ఒక కోనేరు కనబడెను. బండరాతిలో నీరు పొర్లుచుండుట గాంచి దప్పిగొన్న వారు ఆ నీటితో దాహము తీర్చుకొననెంచి చూడ ఆ నీరు ఆకుపచ్చ రంగుతో కనబడెను. అదిగాంచి వారు ఇది పాచియని ఎంత ప్రక్కకు త్రోసినను ఆరంగు మారలేదు. అప్పుడు వారు ఆ నీటిని అసహ్యించుకొని వెనుకకు మరలి తక్షణమే స్పృహ తప్పి పడిపోసాగిరి. అంతట వెంటవచ్చినవారు భీతిజెంది గొల్లుమని యేడవసాగిరి. వారి చేష్టలను చూస్తున్నట్టి అవ్వ అచ్చటికి వెళ్ళి ఆ పచ్చని నీటిని తెచ్చి ముఖముపైచల్లి లేపి ఆ నీటితో వారి దాహము తీర్చగా వారు పైకిలేచి అవ్వపాదములపై బడి నీవులేకున్న మా ప్రాణములకు తప్పక హానిజరిగి ఉండునని పరి పరి విధముల స్తుతించిరి.

ఆ విచిత్రమును చూచినట్టి దొరలు బోయలు అవ్వ సామాన్యమానవురాలు కాదని దేవతయే అని భావించి ఆమె చెప్పినట్టి మాటలు వేదవాక్కులని యెంచి "అవ్వా! ఇక్కడి దృశ్యము చూడ దైవనిర్మితంబుగా గనపడుచున్నది. ఇటువంటి బండపేటు నందు ఈ విధముగా నీరు వుండుట దైవనిర్ణయమేగానీ వేరుగాదు నీవు చెప్పిన తీరుగా ఇక్కడచూడ అన్నియు యదార్థములై గనపడుచున్నవి. ఇందులకు మనము చేయ

వలసినది యేదైన వుండిన నీవే చెప్పవలెనని" అవ్వను కోరిరి. అప్పుడు అవ్వవారితో నాయనలారా! నేను చెప్పునదేమున్నది. నేను స్వప్నమున గన్నట్టి విషయము మీతో చెప్పితిని. ఇక్కడ కనపడుచున్న వన్నియు యదార్థమేకదా! దీనిని బట్టి చూడ ఇచ్చట ఉన్నది అంతయు ఆదిపరాశక్తియైనట్టి జగజ్జనని మహిమయని తోచుచున్నది. మనము ఈ ప్రదేశమంతయు శుభ్రపరచి కోనేటి గట్టునందు చెట్లను కొట్టివేసి చదునుచేసి వెర్రి ఆముదపుచెట్టు వద్ద అమ్మవారు వుండుటకు ఒక చిన్న ఆలయము ప్రస్తుతము కట్టించవలెనని చెప్పగా ఆ మాటలు విన్నవారు ఆదియంతయు శుభ్రపరచి ఆ మరునటి రోజునుండి చిన్న ఆలయము కట్టుటకు పని ప్రారంభించి పూర్తిచేసిరి. ఆ నాటి నుండి అమ్మవారి పూజలు సక్రమముగా ఆ గుడియందే జరుపబడుచున్నవి.

మరుదినము అందరు ఆలయము చెంత కూర్చొని "అన్నలారా! మనము ఎన్నియో రోజులు ఈ ప్రాంతమున వేటలకై వచ్చితిమేకాని మానవసంచారములేని ఎవ్వరు తిరుగుటకు సాధ్యముగాని ఇట్టి స్థలము కానరాదాయెను. మన మీ ప్రాంతము నందుండుట మన మంచికే, మనకు గల భక్తిశ్రద్ధలు పరీక్షించుటకై ఈ విధముగా సృష్టి స్థితిలయకారకురాలగు జగజ్జనని ఈ ప్రాంతమున వెలసి మనకు అండగా ఉన్నదని చెప్పుకొనసాగిరి, ఆ మాటలు విన్నట్టి అవ్వ వారితో బిడ్డలారా! మనము ఇచ్చట ప్రయాసపడి ఆలయము నిర్మించి పూజలు చేయుచున్నామేగాని ఒక్కసారైన జాతర జరిపిన మన గూడెమునకు మేలుకలుగునని చెప్పెను. అందులకు వారు సమ్మతించి ఆదివారం జాతర చేయవలెనని నిర్ణయించి గూడెమంతయు తెలియబరచగా ఆ గూడెమువారు అచేవిధముగా ఆదివారంరోజు అమ్మవారి పూజకు కావలసినవన్నియు సిద్దపరచుకొని జీవజంతువులను వెంటతీసుకొని ఆదిశక్తి చెంతకు అతివైభవముగా తాళాలు, తప్పెట్లు, పిల్లనగ్రోవులు వూదుచు అట్టహాసముగా బయలుదేరిరి. అమ్మవారికి ధూపదీపనైవేద్యములను అర్పించి కుంబకూడు పోయించి మూడు మేకలు రెండు పొట్టేళ్ళను ఆహారంబుగా బలి ఇచ్చి అనేకమగు వేడుకలుచేసి సూర్యుడస్తమించు నప్పటికి స్థావరములు చేరుకొనిరి. ఆ జాతర యంతయు చూచినట్టి అవ్వరూపములో ఉన్న అమ్మవారు సంతోషపడెను. ఆ నాటినుండి మరిఎక్కువగా అమ్మను సేవించుచు సంవత్సరమునకు రెండుసార్లు జాతరలు చేయుచుండిరి. వారు తలచిన కార్యములు తప్పక జరుగుచుండెను. ఈ విధముగా అవ్వ చెప్పినవన్నియు జరుగుచుండుటవలన ఆమెయే ఆదిపరాశక్తియై యుండునని మనసున భావించి అడుగుటకు ధైర్యము చాలక అనేక రకములుగా తర్కించుకొనసాగిరి.

ఈ అవ్వ వచ్చి చేరినది మొదలు మనమిచ్చు ఆహారము ఎప్పుడు తినునోకాని మనమిచ్చినవన్నియు ఒకచోట దాచి యుంచును. ఎవ్వరికి తెలియకుండా పాత్రలో వేయుచుండును. రాత్రి యెక్కడ పరుండునో తెలియదు, అదియుగాక వేకువనే మన, కన్నను ముందుగా ఎప్పుడులేచునోగాని చీకటి ఉండగనే శిఖరము క్రిందనుండి పైకి వచ్చుచుండును. పెద్దదగుటవలన ఆమెను అడుగుటకు సాహసము లేకున్నది అని మదనపడసాగిరి అవ్వ రహస్యము తెలుసుకొనుటకు అవ్వ స్థావరము చెంతచాటుగా పొంచియుండినను యేమియు తెలియదాయెను. కొందరు ధైర్యవంతులగు బోయబిడ్డలు దొరబిడ్డలు నిద్ర ఆహారంబులులేక ఆరురాత్రులు వేచియుండిరి ఏడవరోజురాత్రి నిండుపున్నమినాడు వెన్నెల కాయు సమయమున వారికి నివాసములకు ఉత్తరదిశ యందు దక్షణము వైపుకు గాలి వీచు సమయమున వీణావాద్యములతో కూడిన గానము. వినవచ్చినది. అదివిని వారు ఆశ్చర్యము జెందిరి. కొంత తడువు ఆలోచించి వెన్నెల కాయుటవలన గ్రుడ్డిదారి వెంబడి అరణ్యములోనికి వచ్చుచుండ వారికి సమీపమున పెద్ద వెలుగు గోచరమయ్యెను. అదిచూచిన వారు భయపడి కొంతసేపు అచ్చట నిలచి ధైర్యము తెచ్చుకొని ముందుకు నడవగా కొంతదూరమున దేదీప్యమానమైనట్టి వెలుగు కనబడెను వారు భయపడి అడుగులు తడబడగా చాటుగా ఒక పెద్ద రాతిగుండు ప్రక్క చేరి పొంచిచూడ వారి నేత్రములు మూతలు పడెను. వారికి యెటుపోవను దిక్కు తోచక ఆనాడు అవ్వ ఇచ్చిన బండారు నొసట పెట్టుకొనగా వారికి యధాప్రకారముగా నేత్రదృష్టి వచ్చెను. అంతట వారు ధైర్యముగా అటుచూడ రూపరేఖ లావణ్యము కలిగి యవ్వనప్రాయము కలిగినట్టి ఒకస్త్రీ ఉయ్యాలలో కూర్చుండి వూగుచుండుట కనపడెను. ఆమెచెంత ముగ్గురు పురుషలు విభూతి దరించి సంభాషించుచుండిరి. అచ్చటికి వెళ్ళిన వారు ఆ దృశ్యము స్వయముగా చూచి భయభ్రాంతులైరి. కొంత తడవునకు ఆ వింత దృశ్యము అదృశ్యమాయెను. ఆ ప్రదేశమంతయు చీకటిమయమై మబ్బు క్రమ్మెను. వారు దారి తప్పి అరణ్యమున కొంతదూరము వచ్చునప్పటికి వెన్నెలలో ఒకస్త్రీ బంగారు జలతారు సరిగంచుగల గజ్జల చీరకట్టుకొని కొండ క్రిందుగా పోవుట గాంచిరి. ఆమె ముఖారవిందము చూడ కోటి సూర్యప్రకాశితమై బంగారు ఛాయరంగు శరీరముతోను మన నేత్రముల వంటి కన్నులతోను తుమ్మెదరెక్కల వంటి కేశములతోను ఆజానుబాహులాలగు ఆ దేవతాస్త్రీ కొండక్రిందగల పేటువద్దకు ముగ్గురు బ్రాహ్మణ పురుషులను వెంటబెట్టుకొని పోవుటగాంచిన దొరలు బోయులు కడుపునొప్పితో అచ్చట పడి భయంకరమగు కేకలు పెట్టి దుఃఖించి స్పృహతప్పిరి. అదియంతయు గమనించినట్టి అమ్మవారు మనబిడ్డలు మనలను పరీక్షించుచున్నారని

యెంచి శాంతస్వభావము వహించి ఆ రూపమును వదలి త్రిమూర్తులకు చెప్పి వారి స్థానములకు వారినంపి అవ్వరూపముతో మరల వారున్న చోటుకువచ్చి వారి బాధను మాన్పి స్పృహతెప్పించెను. ఇచ్చటికి మీరేల వచ్చితిరని యడుగ వారుచూచిన దృశ్యములన్నింటిని అవ్వతో చెప్పగనే వారు మూగజీవులైరి. అటులచేయని యెడల ఈ విషయమంతయు ఇతరులకు తెలియజేయుదురని యెంచి వారిని వెంట నిడుకొని గూడెముజేరెను.

అవ్వ వారికి యే హాని జరుగకుండా పిలుచుకొని వచ్చినందున ఆ గూడెము వారందరు ఆమె పాదములపైబడి అమ్మా భూలోకమాతా! లోకకటాక్ష వీక్షణీ! సర్వ సృష్టికి మూలాధారశక్తి మా పాలిట కల్పవల్లి ఓ త్రిపురసుందరీ! ఈ అరణ్యమున అవ్వ రూపమున ఉన్నట్టి ఓ జననీ! నీ పాదారవిందసేవ నిత్యము ఒసర్తుమే అని వేడుకొన అవ్వరూపమున ఉన్నట్టి అమ్మవారు వారిని చూచి జాలిపడి వారిని పైకిలేపి అభయ మిచ్చి "బిడ్డలారా! మీరు నన్ను, మిమ్ములను నేను నమ్ముకొని ఇంతకాలము గడిపి నాము ఇక నేను వెళ్ళుచున్నాను కానీ నేనెచ్చట ఉన్నను మీకు ప్రాణహాని జరుగ నివ్వక అన్నివిధముల మీకు సహాయపడుచూ మీ శత్రువులను హతమార్చి భయము పోగొట్టి శాంతింపజేయుదును. కాన మీరు మన శిఖరమందున్నట్టి అమ్మవారిని మరచినయెడల అనేక బాధలు తప్పవు ఇప్పుడుండులాగునే ఉండవలెనని చెప్పగా అందరు సంతోషించిరి నాటినుండి అవ్వ కంటబడక పోయెను.

ఆనాటినుండి గూడెము వారందరు చింతాక్రాంతులై పిల్లలు, పెద్దలు, స్త్రీలు బెంగపెట్టుకొని ఆ పరిసర ప్రాంతమంతయు వెదకగా ఆమెజాడ తెలియదాయెను. అప్పుడు గూడెములో ఉన్నట్టి పెద్దలు తమ వారందరు అవ్వను గూర్చి దిగులుజెందు చుండిరి. కాన వారి భీతిపోగొట్టుటకుగాను వారందరిని ఒకచోట చేర్చిరి పెద్దలు వారితో మన అవ్వకాదు ఆమె ఈ సమస్త సృష్టికి ఆదిపరాశక్తియైన జగజ్జనని ఎక్కడకు పోలేదు. మన హృదయమందే వున్నది మన పూర్వజన్మ సుకృతముచే మానవుల మైన మనము అవ్వరూపముతో చూడగలిగితిమి. కావున మనకింకెప్పుడు గాని శత్రువుల భయముండదు. మనకు అమ్మతోడై ఎల్లప్పుడు కాపాడుచుండును గాన ఆమెను సేవించుటయే మనధర్మమని చెప్పగా ఆనాటినుండి వారు మిక్కిలి భక్తిశ్రద్ధ లతో ఆ మహాతల్లిని సేవించుచుండిరి.

అవ్వ గూడెము విడిచి వెళ్ళిన కొన్నిరోజులకు వారున్నట్టి స్థావరముల దక్షిణ

భాగము నుండి అర్థ ఆమడ దూరమున గల గ్రామాదులయందు మహ్మదీయుల దాడులు ఎక్కువైనవి. హిందువులను హతమార్చుటకు ఆ ప్రాంతమందు వారు స్థావరములను ఏర్పరచుకొని అక్కడ ఉన్నవారిని అనేక బాధలు పెట్టుచుండ అక్కడివారు గ్రామములు వదలి కొండకుచేరి వారికి ఎక్కడ వుండుటకు చోటులేక గూడెమునకు వచ్చి మొర పెట్టుకొనిరి. ఆ గ్రామాదుల యందు జరుగు విపరీతములను చెప్ప బాధపడిరి. అందు లకు వారు తగిన సమాధానము చెప్పగా వారును ఆ గూడెమందు చేరిరి.

అంతట మహమ్మదీయులు ఆ ప్రాంతములను చూడ అక్కడ పల్లెలందు, హిందువులు ఒక్కరుగానీ లేనందుననూ వారి బారినుండి తప్పించుకొని పోయినట్టి దొరలు, బోయలను యెక్కడ ఉన్నను వెదకి వారిని హతమార్చవలెనని, లేని యెడల వారితో యెప్పటికైనను హాని తప్పక జరుగునని యెంచి చుట్టుప్రక్కల గల కొండ కోనలయందు వెదకనారంభించిరి.

ఆ ప్రాంతమున జరుగుచున్న ఈ ఘోరములను చూచినట్టి దేవాంశసంభూతు రాలగు జనని దొరలకు, బోయలకు హాని జరగకుండా చూచుటకు మహ్మదీయుల గర్వ మణచుటకు ఎఱుకలసాని రూపము దాల్చి సోదెచెప్పలాగున వారిస్థావరముల వద్దకు వెళ్ళి చుట్టూ అటు, ఇటు తిరుగుచుండెను. నవాబు సైనికులు ఆమె చెంతకు వెళ్ళి నీవెవ్వరు? ఇక్కడికేల వచ్చితివి? మా శత్రువుల గూఢచారివా? అని గద్దించి అడుగ అందులకు ఆమె స్వామీ! నేను సోదెచెప్పుకొని జీవనము గడుపుటకు ఈ ప్రాంతము నకు రాగా ఈ గ్రామాదుల నందు యెవ్వరుకాని కనబడలేదు. వారి నివాసగృహములు శిథిలావస్థలో ఉండగా నేను నిరాశపరురాలై పల్లెలు తిరిగి, తిరిగి అలసటజెంది భుక్తి మార్గము లేనందున అంతదూరము నుండి మీ స్థావరములను చూచి వచ్చియున్నాను. మీలో యెవరికైనను సోదె అడిగినను చెప్పెదననగా ఆ వార్త సైనికులు నవాబున కెఱింగించిరి.

నవాబు ఆ ఎరుకలసానిని రమ్మని కబురంపగా వారు వెళ్ళి ఆమెను తోడ్కొని వచ్చిరి. నవాబు ఆమె అందచందములను చూచి మోహాంధకారముచే ఎరుకలసాని! సోదెబాగుగా చెప్పెదవా! అటుచెప్పకున్న నిన్ను వూరక పంపము. ఊరూరు ఇల్లిల్లు తిరిగి భిక్షమెత్తుట కంటె నీవు మా చెంతచేరి సర్వరాజ భోగములను అనుభవించ వచ్చుగదా! నీ యొక్క సౌందర్యమునకు ముగ్ధుడనై మంచి మాటలతో చెప్పుతున్నాను. మర్యాదగా నాకు లోబడని యెడల ఈ ప్రాంతమున అడ్డువచ్చువారు ఎవ్వరులేరు.

మేము చక్రవర్తులము. ఈ దేశమంతయును నాది. రాజ్యపాలన చేయుచున్నాము. ఇట్టి అవకాశము మరలా నీకు దక్కదు. నీకు కొన్ని గ్రామములు గూడా జాగీర్లు వ్రాసి ఇచ్చెదను: నీవు సరే అన్న తక్షణమే నిఖాచేసుకొందునని అనేక విధములుగా బెదరించెను. మర్యాద తప్పి అడుగుచున్న నవాబును ఎరుకలసాని రూపములో ఉన్న అమ్మవారు శాంతముతో చూచి "మహారాజులు మీరు, నేను అడుక్కతినుదానను మీరెక్కడ? నేనెక్కడ? మీ అంతఃపురమున తిరుగుటకు నాకు అర్హతలేదు. మా బోటి వారిని ఈ విధముగా మాట్లాడుట భావ్యముకాదు మేము దేశములు తిరుగుతూ ఇటువంటి నేరములు చేసిన మా అమ్మవారు సహించరు. అట్లుచేయునది భోగమువారే కానీ మాకు పరివాటికాదని బుద్ధి వచ్చునట్టు చెప్పగా. నవాబు మండిపడి తిరిగి ఆలోచించి ఈ విధముగా బెదిరింపులకు ఇది లొంగదని యెంచి ఆమెతో యేదో తెలియక మాటాడితిని ఆ మాటలు మరచి సోదెచెప్పుమనగా సరేనని అతనిచేయి చూచి దేవతలను వేడుకొని ఈ విధముగా చెప్పసాగెను. "ఓ నవాబు! నీవు అనేక రాజ్యములను జయించి ఇచ్చటికి వచ్చినావు. ఈ ప్రదేశమున్ను నీ వశమైనది దేశమంతయు నీ వశము కావలెనని బోయలను, దొరలను వంశనాశనము చేయదలచినావు. మరియు హిందువులు మీ మతమున కలుపుకొనవలెనని కోరికవున్నది. మీరు ప్రభువులగుట వలన నిజము చెప్పుచున్నాను. మీ ప్రయత్నము యిప్పటికి విరమించుట మంచిది అట్లు లేని యెడల మీరు ఇచ్చటనుండి పోలేరు. మీరు చేయు దుష్టప్రవర్తనకు భగవంతుడు ఇంతవరకు ఓర్చినాడు. ఇకనుండి మీకు అపజయము తప్పదని అమ్మమీద ప్రమాణముచేసి చెప్పుచున్నాను. అవియన్నియు విడచి భార్యబిడ్డలతో కాలము గడుపుట శ్రేయస్కరమనియు అటులేని యెడల మరణము తప్పదనియు చెప్పెను.

ఆ మాటలు వింటున్న నవాబు మండిపడి కోపోద్రిక్తుడై "ఓసీ! ఎఱుకల ముండా! అడుక్కతినుటకు మా స్థావరముల వద్దకు వచ్చి మేము చెప్పినవి లెక్కచేయక మమ్ములనే నిందించుచున్నావే! నీకెంత గర్వము? నీవు ఇంతవరకున్ను చెప్పిన సోదెప్రకారము జరుగునంతవరకు ఈ స్థలము విడిచి ఎచ్చటికి పోకూడదు. ఇచ్చటనే ఉండుము" అని దిగ్గునలేచి ఆమె హస్తము పట్టబోగా ఎఱుకలవాని రూపమున ఉన్న అమ్మవారు కోపోద్రిక్తురాలై నేత్రములు ఎఱ్ఱజేసి "ఓరీ నవాబు! నీవెంతటి వాడవు! కామాంధకారమున కన్నుగానక ఆదరవు లేనట్టి స్త్రీలను చెఱబట్టుచున్నావే! నీ అధికారమెంత! నీవెంత! నిన్ను ఇప్పుడే భ్రష్టత్వము చేసెదనని సింహాసనము పైనున్న నవాబును కాలితో తన్నగా వాడు క్రిందపడి ఖడ్గహస్తుండై పైకిలేచి

ముందుకు వురికెను. అతని చెంతనున్న అనుచరులు నవాబు స్త్రీచేత దెబ్బతిన్నందుకు ఆగ్రహించి ఆమె పైకి కత్తులు బల్లెములు విసరగా అవి పుష్పహారములై ఆమె కంఠములో అమరెను. ఆ వింతగాంచి ఫిరంగులకు నిప్పు అంటించగా అందులో నీరు కారుట మొదలు పెట్టెను. అటు కొంత తడవునకు వారికి చిత్తభ్రమ కలిగి వారే కలహించుకొనసాగిరి. వారి గుడారములన్నియు అగ్నిమయమై తగులబడి పూర్తిగా భస్మమైపోయెను. అందువున్న స్త్రీలు, పిల్లలు కట్టుగుడ్డలతో బయటపడగా స్థావరములు అన్నియు శూన్యమై అనేకమగు నష్టము వాటిల్లెను. ఆసమయమున ఈ చిత్రము చూచిన నవాబు భార్య మనవారందరు మరణింతురని యెంచి అచ్చట వున్న అమ్మపాదముల పై బడి తన భర్త ప్రాణము తమ వెంట వచ్చిన వారి ప్రాణములను కాపాడి పతిభిక్ష పెట్టి పసుపు కుంకుమ నిలుపుమని వేడగా ఆమె దైవభక్తి పరాయణురాలని గమనించిన అమ్మవారు వారిని విడిచి పెట్టెను.

అమ్మవారు జాలిపడి విడిచిన తోడనే పారిపోయినవారు కాక అక్కడవున్న మహ్మదీయులు ఇక ఇచ్చట వుండిన తమ ఆటలు సాగవని ప్రాణహాని తప్పక జరుగునని యెంచి వున్నవారు గోల్కొండ పాదుషా చెంతకు వెళ్ళి అచ్చట జరిగిన వృత్తాంత-మంతయు తెల్పిరి. ఆ వార్తవిన్న పాదుషా మండిపడి అమిత కోపముతో "బొరాపిరికి పందల్లారా! ఆడదానికి భయపడి బెదరి వెనకకు పరిగెత్తినారే! మీరు మహ్మదీయులేనా! ఆ దొరతెంత! బోయతెంత! నీవు సైన్యాధిపతివేనా! నీకు పదవి భారమేల? నీవు ఆడదానివే! నీవు ఈ నాటినుండి పందులు మేపుట మంచిది" అని అనేక రకములుగా దూషించి అతనిని శిరచ్ఛేదము చేయించెను. తర్వాత పాదుషా పండ్రెండు లక్షల సైన్యమును వెంటబెట్టుకొని దక్షిణ ప్రాంతములకు తానే స్వయముగా బయలుదేరెను. ఆ విధముగా వచ్చి స్థావరముల నేర్పరచి పట్టపు యేనుగును అచ్చట ఒకి పెద్దరాతికి కట్టి వేసెను. అక్కడ పెద్దరాతికి కట్టినట్టి మదగజము అడవి దద్దరిల్లులాగున ఘీంకారములు పెట్టగా ఆ శబ్దమును శిఖరముపై నున్న బోయలు వినిరి.

ఆ శబ్దము విన్న బోయలు, దొరలు తిరిగి మహ్మదీయులు వచ్చినారనే విషయం గుర్తించి వారి రహస్యము తెలిసికొనదలచి అవ్వ ఇచ్చిన విభూతి నొసటపెట్టుకొని మహ్మదీయులవలె వారి సైన్యములో కలిసి గూఢచారులై మెలగుచు వీలుపడినప్పుడు సమయము చూచుకొని ఆయుధములను నల్లమందు తెచ్చి శిఖరముపై గెరిసెలలోవేసి భద్రపరచుచుండిరి. అమ్మవారి ఆలయమున మాత్రము నిత్యము ధూపదీపనైవేద్యముల నిచ్చి సేవించుచుండిరి.

కొండశిఖరముపై సురక్షితముగా జీవనములు గడుపుచున్నట్టి మిగత దొరలు, బోయలు అమ్మవారి దయతో ఏ ఆహారపు కొరత లేక సుభిక్షముగా నుండిరి. పశువుల సంపద సమృద్ధిగా ఉండెను. వాటిని మేపుటకుగాను వారి బిడ్డలు రోజు అరణ్యమున తిరిగి వారి స్థావరములు చేరుచుండుట వాడుక. ఒకరోజు ఆ బాలురు పశువులను మేపుచూ కొండక్రిందకు వచ్చిరి. ఆ మైదాన ప్రదేశమందు మేత వుండుట వలన అచ్చట పశువులను మేపుకొనుచుండిరి, ఆ సమయమున బోయలను దొరలను వెదకు చున్న మహ్మదీయ సైనికులు ఆ దారిన వచ్చుచూ అచ్చట ఉన్న బిడ్డలను గమనించి వీరు బోయబిడ్డలని యెంచి ఇంతటి అరణ్యమున వీరు తప్ప ఇంతధైర్యముగా వేరెవ్వ రుండరని వారిని అనుమానించి వీరిని పట్టుకొన్న అన్ని స్థావరముల జాడలు సులభ ముగా తెలుసుకొనవచ్చునని భావించి వారిచెంతకు వేగముగా వచ్చుచుండిరి. వారిని గాంచిన బిడ్డలు భీతిజెంది అక్కడవున్న పశువులను వదలి అరణ్యము వెంబడిపడి పరుగెత్తి కంపలు. రాళ్ళు తొక్కుచు గుంత మిట్టయనక పరుగెత్తుట మొదలిడిరి, అది చూచిన సైనికులు వారిని వెంటాడుచు పరిగెత్తసాగిరి.

ఆ విధముగా బోయబాలురు భీతితో పరుగిడుచుండ మహ్మదీయులు వెంటాడ సాగిరి. పసిబాలురగుటచే ప్రాణభీతి యెక్కువై గడ గడ వణకుచు చుట్టు ప్రక్కల యెవ్వరైనా ఉన్నారాయని చూడ యెవ్వరు కనపడరైరి అంత బాలురకు దిక్కుతోచక దిగులుజెంది పొదలచాటున వారి కంటబడక కూర్చుండి దుఃఖించుచు వారు సేవించునట్టి అమ్మవారిని అనేక విధములుగా వేడుకొనిరి. మహ్మదీయులు వారిని సమీపించుచుండిరి. ఆ బిడ్డల మొరవిన్న అమ్మవారు వృద్ధుని రూపము ధరించి గొర్రెల మేపుచుండగా మహ్మదీయ సైనికులు చాటుగా వచ్చి వారిని పట్టుకొనిరి. భయపడుచున్న ఆ బిడ్డలను చూచి మీరు యెవ్వరు మీదేప్రదేశము చెప్పమని గద్దించి అడిగిరి. అందులకు ఆ బిడ్డలు వారి వేషములు చూచి మరికొంత భీతిజెంది గడ గడ వణకుచూ నోటమాటరాక అటు, ఇటు పారజూచి సమీపమున వున్నట్టి వృద్ధుని చూపి అచ్చటవున్న మా తాతనడుగుమని చెప్పిరి. అప్పుడు వృద్ధుకు ఆ బిడ్డల బాధచూచి వారిచెంతకు వచ్చి మహ్మదీయులతో యెవరయ్యా మీరు! నా బిడ్డలను ఈ అరణ్యమందు బాధించుచున్నారు. మీ దేవూరు? గొర్రెలను పశువులను మేపుచున్న మమ్ము బాధించుట ధర్మమా అని అడుగగా మహ్మ దీయులు వృద్ధుని చూచి మమ్ములను ఎదిరించువారు ఎవ్వరు ఈ ప్రాంతమందు లేరు. ఇప్పుడు మమ్ములను ఎవ్వరని ప్రశ్నించుచున్నావు. ఇంతకు నీవెవరు! చెప్పుము అని బెదిరించిరి. అందుకు వృద్ధరూపములో వున్న అమ్మవారు నా వూరు అదిగో అచ్చట

అగుపడు గొల్లపల్లి నా పేరు వలపన్న ఆ బిడ్డలు నా కుమార్తె మరియు కొడుకు బిడ్డలు. మాది గొల్లకులమని వారితో చెప్పి బావి వద్దకు వారిని తీసుకవెళ్ళి చద్ది అన్నము మూట విప్పి తినుటకు కూర్చుండెను. మహ్మదీయులు బాలురను నిజము చెప్పుమని మరి, మరి గద్దించి అడుగవారు వణకుచు మేము గొల్లవారమే మా తాత వెంటవచ్చియున్నాము. అని కంటనీరు పెట్టుకొనిరి. అది చూచిన వలపన్న యేమయ్యా: వారు నా మనవండ్లని యెన్నిసార్లు చెప్పినను వినరాయని కోపించుకొనగా అదిచూచి మహ్మదీయులు అటుల వారు నీ బిడ్డలైన యెడల నీచెంత కూర్చుండి భోజనము చేయుడనగా అందులకు వలపన్న బిడ్డలను చెంతకు పిలిచి ముగ్గుర్ని కూర్చుండ బెట్టుకొని అందరూ భోజనముచేసిరి అదిగాంచినట్టి మహ్మదీయులు నిజమే వీరు గొల్లబిడ్డలని యెంచి వారిని అచ్చట వదలివెళ్ళిరి.

ఆ సమయమున ప్రాణములను కాపాడి రక్షించిన ఆ ముసలి వలపన్న పాదములపై బడి ఆ పిల్లలు తాతా! ఈ అరణ్యమున మమ్ములను కాపాడినందుకు మా వంశమున్నంత వరకు మీ పేరు నిలుచునాగున యే శుభకార్యములు జరిగినగాని మిమ్ము తలచుకొనుచుందుము అని అనేక రీతులుగా పొగడి వలపన్నకు నమస్కరించి కొండపైకి బయలుదేరిరి. వలపన్న గూడా బిడ్డలను దీవించి పంపెను. ఆ బాలురు పదిగజములు ముందుకు వెళ్ళి వెనకకు చూడగా ఆ వృద్ధుడు అగుపడడాయెను. ఆ బాలురు అదిగాంచి చుట్టు తిరిగిచూడ అతడుగాని గొఱ్ఱెలుగాని ఎచ్చటను కనపడలేదు. అప్పుడు వారు అమ్మవారే ఈ రూపమున వచ్చి తప్పించెనని యెంచి అనేక విధములుగా స్తుతించుకొనుచూ తమ స్థావరములు చేరి ఆ నాడు జరిగిన విషయమంతను తమ వారికి చెప్పిరి. వారును ఆశ్చర్యముజెంది అమ్మవారే ఆ వృద్ధుడని భావించి ఆ మరుసటి రోజు ఆ బిడ్డలు ఆ కుటుంబీకులు అందరూ వెళ్ళి అమ్మవారిని సేవించుకొని వచ్చిరి.

గొల్ల బాలురని విడచిపెట్టిన మహ్మదీయ సైనికులు వారి స్థావరములకు వెళ్ళుచూ ఏ దారిన బోవుటకు దిక్కుతోచక అడవి మార్గము గుండా బయలుదేరి పోవుసమయమున కొండపేటుకు పెభాగమున మనుష్యుల సంచారము వారికి అగుపడెను. అదిగాంచిన మహ్మదీయ గూఢచారులు అడ్డుదారుల గుండా కొండపైకి బయలుదేరి పోవుచుండగా స్త్రీలుకూడా కనబడిరి. కొందరు తేనెలు తీయుటగూడ గోచరమయ్యెను. అదిచూచిన వారు మనమున్నది కొంతమంది వీరికంటబడిన మన ప్రాణములను తీయుదురని భయపడుతూ పొదలచాటుగా దాగికొనిరి. చీకటిపడునరికి వారి స్థావరముల చెంతకుచేరి ఆ రాత్రి నిదురసరిగా నిదురపోక మేల్కొని ఉండి వారి సంభాషణలను

వినుమ వీరే బోయలు, దొరలు ఇట్లు అరణ్య ప్రదేశమునచేరి ఇన్ని రోజులుగా యెవరి కంటబడక ఈ నాటికి అల్లాదయతో వీరి రహస్యములు తెలుసుకొంటిమని సంతసించి సూర్యోదయము వరకు అక్కడ నిలువక వేకువనేలేచి అడ్డదారులగుండా వారిస్థావరముల చెంతకుచేరి వారు తెలిసికొన్న రహస్యమున జరుగు వింతలు అచ్చటికిపోవు మార్గములు తేటతెల్లముగా వారి పాదుషాకు తెలిపిరి. దొరలు బోయల ఉనికి తెలిసికొని వచ్చిన సైనికులను చూచి పాదుషా సంతోషించి వారికి కొంత బహుమానముల నిచ్చి మెచ్చుకొనెను. అటు పిమ్మట సైనికులను పిలిచి మనమిక ఆలస్యము చేయుట మంచిదికాదని రేపు ఉదయము దండయాత్రకు అన్నియు సిద్ధపరచుడని చెప్పి ఎండ తగలక మునుపే శిఖరముపై గల స్థావర ప్రదేశములకు చేరవలెనని ఉత్తర్వులిచ్చెను.

ఆ రోజు గూడెము వారందరు ఎక్కడికిపోక జాతర విషయము మాట్లాడుకొనుచుండిరి వారి గూఢాచారులు కూడా మహ్మదీయులు శిఖరమునకు వచ్చు విషయము వారికి తెలియలేదు అందువలన ఆ రోజు సూర్యాస్తమయమునకు ముందే పూజాద్రవ్యములను గైకొని స్థావరముల ముందు గుంపుచేరి తప్పెట్లు, తాళాలు మొదలగు అనేక రకములైన వాయిద్యముల శబ్దములతో వినోదములు జరుపుకొనుచుండిరి. వారికి అర్ధ ఆమడదూరమందున్నట్టి మహ్మదీయులు శిఖరముపైకి చూడ జనసమూహము కనబడెను, ఆ సందర్భమున చూచినట్టి శత్రువులు గుంపునంతయు ఒక్కసారిగా హతమార్చవలెనని యెంచి ఒక ఏనుగును ఒక పెద్ద గుండుపై ఎక్కించి దానిపై ఫిరంగులను పెట్టి కొండపైనుండు గుంపుకు సూటిగా గురిపెట్టి ఫిరంగులు పేల్చిరి. కానీ అదేమి మాయమో అంతదూరముపోక నిలిచిపోయెను. యెదుటి వారికి ఏహానిగాని జరుగలేదు. వారు ఆ విధముగా యెన్నిసార్లు కాల్చిననూ రవ్వంతగానీ శిఖరప్రదేశమందుండు గుంపు చలించనందున ఇక ప్రయోజనము లేదని యెంచి ఇక్కడ ఉండిన వారు తప్పించుకొందురని ఆ రాత్రి యందే కొండచుట్టు ముట్టడి వేసిరి.

శిఖరముపైనున్న బోయలు, దొరలు కొండక్రిందగల మహ్మదీయ శత్రువులు ప్రయోగించినట్టి ఫిరంగుల శబ్దము విని క్రిందికిచూడ మహ్మదీయ సైనికులు కనబడిరి. అదిచూచి వారు భయభ్రాంతులై ఈనాడు జాతర చేయుటకు మొదలిడ అశుభసూచకములు కనపడుచున్నదని వారందరు తర్కించుకొనిరి. ఇచ్చటవున్న మన స్థావరములను కనుగొని వారు ఊరకుండురాయని అనేక రకములుగా ఆలోచించి తిరిగి ధైర్యము తెచ్చుకొని ఆదిశక్తియైనట్టి అమ్మవారు మనకండగా ఉన్నంతవరకు యెవ్వరును యేమిచేయలేరని యెంచి నిర్భయముగా ఆమే దిక్కని జాతర చేయుటకు మొదలుపెట్టిరి. సంతోష

సంతషముతో అమ్మవారి ఆలయమునకు వెళ్ళి ఆ రాత్రి వేడుకలతో బయలుదేరి మధు పానీయములను సేవించి మదోన్మత్తులై పాటలు పాడుచూ ఆలయమునకు వచ్చి వైభవముగా పూజలు జరిపి కర్పూరహారతులనిచ్చి ధూపదీపనైవేద్యములు పెట్టి నారికేళంబులను పగులకొట్టి అటు తరువాత కుంబకూడు బోయించి అమ్మవారికి ఆహారంబుగా యిచ్చిరి. ఆ రాత్రి నుండి తెల్లవారు వరకు వైభవముగా జాతరచేసి అచ్చటనే వంటకు ప్రయత్నము చేసి ఆలయము చెంత విలాసముగా గడుపుచుండిరి.

అట్టి సమయంబున మహమ్మదీయ సైనికుల కొండచుట్టు ముట్టడించి యెటు పోవుటకు మార్గము తోచక ఉత్తరభాగమున కొంత మంది సైనికులు మామూలు దారి ననుసరించి ముండ్లపొదలను తప్పించుకొని కొండపైకి పోవుచుండిరి అదేవిధముగా దక్షణభాగమునుండి మరికొంత మంది అడ్డదోవలలో పైకి ఎక్కుచుండిరి. ఆసమయమున ఆ గూడెమందున్న చాలమంది అమ్మవారి జాతరకు వెళ్లియుండుటవలన అచ్చట కొంతమంది స్త్రీలు, వృద్ధులు, చిన్నపిల్లలు తప్ప మరియెవ్వరు లేకుండుటవల్ల వారు భయబ్రాంతులై యేమి చేయుటకును దిక్కుతోచక దిగులుచెందియుండిరి. జాతరకు వెళ్ళిన గూడెములోని చాలామంది పురుషలు, స్త్రీలు ఆలయము వద్దనే వుండిరి. గూడెము సమీపించిన మహమ్మదీయు శత్రువులను చూచినట్టి దొరలు, బోయలు యేమిచేయుటకు దిక్కుతోచక అచ్చట ఉన్నట్టి అమ్మవారిని తరుణోపాయము గూర్చి అనేక విధముల వేడుకొనసాగిరి. "తల్లీ! నిత్యము నీ ధ్యానము, నిత్యము నీ సేవ చేయుచే మాకు ముక్తిమార్గం. నీ అత్మనెఱిగి నీ పాదసేవ చేయుచే మాభాగ్యము గదా భక్తులపై దయచూపి కనికరించి కాపాడుమమ్మా! భీతిని తొలగించి మాయభీష్టంబులు తీర్చి మోక్షమొసగుము. ఈ నాడు ఘోర అరణ్యమందు ఈ ఆపద తొలగ చేయ మార్గము చూపవమ్మా! మీ చెంత నున్నట్టి మా పురుషులెపుడొచ్చెదరో గాని అంతలోన జరిగెడు ఈ ఘోరమునరికట్టు బారము నీదే! ఆనాడు ఈనాడు మా అందరికి అండదండగా నిలిచి కాపాడుము." అని అనేక విధములుగా ఆ దేవతయగు జగజ్జనని వేడుకొనిరి. మరియు సృష్టికి స్థితిలయకారకురాలగు నిన్ను నమ్ముకొని పదుమూడు సంవత్సరములుగా మీ అండచేరిన మమ్ములనాదరించినట్టి సర్వేశ్వరి ఈ నాడెందున్నావమ్మా! ఇచ్చట మా భర్తలు లేని వేళలందు తురష్కులు మాపై దాడికి వచ్చుచున్నారే వారు వచ్చి మాపైబడి వ్రితములు చెఱుపుటకు సాహసింతురేమో ఇప్పుడు ఈ అరణ్యము నుండి యెచ్చటకు పోయెదము? ముక్కు పచ్చలారని పసి బిడ్డలు, స్త్రీలు, పిల్లలు, వృద్ధులను కాపాడు వారెవరని అనేక విధములుగా దుఃఖించసాగిరి. అమ్మా!

నీవు మమ్మేలను సృష్టించి యిప్పుడు మాకు ఆపదలు తెచ్చిపెట్టుచున్నావు మొట్ట మొదట వారి దాడికి బలి అగునది పిల్లలు వృద్ధులును అగు మేమే అని బాధపడ సాగిరి. అంతలో వారికి తెలియకుండా ధైర్య సాహసములు పెంపొందెను. ఎదురించు శక్తి ఉత్సాహము కలిగెను. యుద్ధమునకు తలపడిరి. యుద్ధము చేయుట చేతగానందున పోరాడు విధము తెలియనందునను ఆయుధములకు బదులు రోకళ్ళతో వారిని బాదుచు గడ్డపారలతో ఘోరముగా శిరస్సులను పగులకొట్టిరి. ఆ దెబ్బలకు తాళలేక వారిలో కొంతమంది పరుగెత్తసాగిరి. కొంతమంది అక్కడికక్కడే మరణించిరి. అంతట ఆ స్త్రీలు వారి శిరస్సులను ఒక మర్రిచెట్టుకు వేలాడగట్టిరి. ఆ విధముగా పారిపోయిన మహమ్మదీయులు ఆ ప్రాంతమున ఉన్నట్టి వారి నవాబు చెంతకు వెళ్ళి కొండపై స్థావరముల చెంత జరిగిన విషయమంతయు పూసగుచ్చినట్లు చెప్పగా నవాబు మండిపడి అత ఆగ్రహముచేత ఊగాడెను. ఉన్న సైన్యమునంతయు వెంటనిడుకొని కొండపైకి ప్రయాణము సాగించెను.

ఆ గూడెములో ఉన్నట్టి అనేక జాతులవారు జాతర వైభవముగా నడిపి అన్ని కార్యక్రమములను జరిపించుకొని ఆలయము వద్దనుండి స్థావరముల చెంతకు తిరుగు దేరి పోవుచుండగా వారికెదురుగా వృద్ధులు పసిబాలురు వేగముగా పరిగెత్తి వచ్చుట చూచి కారణమేమని అడిగి ప్రశ్నించిరి. అందులకు వారు ఆ నాడు తమ స్థావరములకు మహమ్మదీయులు వచ్చుటయు స్త్రీలు వారితో యుద్ధము చేసి అనేక మందిని హతమార్చిన విషయమును తెలిపిరి. తాము లేని సమయమున ఒంటరిగా వున్న తమ స్త్రీలు వృద్ధులు పిల్లలపై బడుటకు ప్రయత్నించినట్టి సైనికులను వారి స్త్రీలు హతమార్చిన విషయమును విని సంతోషము జెందిరి. ఆ సమయమున మహమ్మదీయులు వారికున్న సైన్యమంతయు వెంటనిడుకొని కొండపైకి వచ్చుట వారికి గనపడెను. అది చూచి భీతిజెంది యేమిచేయుట దిక్కుతోచక అచ్చటనుండి అమ్మవారి ఆలయము చెంతకు పరుగిడవచ్చి రాబోవు కష్టములను గూర్చి కొంత తడవు యోచించి ధైర్యము తెచ్చుకొని అందరు ఆ సరస్సునందు స్నానము ఆచరించి తడిగుడ్డలతో ఆలయమునకు వచ్చి అనేక విధములుగా అమ్మవారిని స్తుతించుకొనుచు అచ్చటనే గుమిగూడి మహమ్మదీయ సైనికుల రాకకై ఎదురుచూచుచుండిరి.

పెద్ద సైన్యమును వెంటనిడుకొన్నట్టి నవాబు నెత్తుటికొండ మార్గమును బట్టి కొండదారి గుండా శిఖరముపైకి వెళ్ళుచుండగా నట్టి సమయమున అమ్మవారు వృద్ధురాలువలె దారి కడ్డముగా వెళ్ళి నాయనలారా మీరింతమంది కొండపైకి పోవు చున్నారే

గాని పూజాద్రవ్యములుగాని అమ్మవారి ఆహారనిమిత్తము జీవావలిగానీ మీ వద్దలేదే యని ప్రశ్నించెను అందులకు వారేమియు జవాబు చెప్పక అటులనే పోవుచుండిరి. తిరిగి కొంతదూరము పోవునరికి అదే ప్రకారముగా వృద్ధురాలు హెచ్చరించగా అందులోనొకడు వికటముగా అమ్మా నాయనా మాకు తెలియదు మానవురాలగు ముస లిది దొరలకు, బోయలకు తల్లి కావచ్చుగానీ మా నాయనకు పెద్ద భార్యయా, లేక ఉంపుడుకత్తెయా నీవు చెప్పునది అని గర్వముతో యెగతాళిగా పలికెను ఆ పలుకులు విన్నట్టి అమ్మవారు ఓరీ దుర్మార్గుడా మా తల్లిని నిందించెదవా! నీ నోట పుండు బుట్ట! మీరు మతభేదముతో దేవుడు, దైవములేక సృష్టికర్తలను కూడా నిందించుచున్నారే! మీకు మంచిగతిరాదని అనేక విధములుగా మహమ్మదీయులను దూషించెను. ఆ మాటలు విన్న నవాబు సైనికులు వృద్ధురాలినిచూచి ఓ ముసలి ముండా! మేమెవ్వరమని అను కొని కన్ను మిన్నుగానక ప్రవర్తించుచు నోటికి వచ్చినట్లు ప్రేలుచున్నావు? ఈ దేశ మంతయును వశముచేసుకొని పాదుషాయని బిరుదుపొంది సామంతులచెంత కప్పములు కట్టించుకొనుచు పాలనచేయు నవాబు మా చెంతవచ్చుచున్నాడు. అది తెలుసుకోలేక అమ్మను గూర్చి ప్రతాపంబులు పలుకుచున్నావు? నీవు ఇప్పుడో రేపో కాటికి పోవుటకు కాళ్ళు జాపు...ని ఉన్నట్టి ముసలమ్మవు. నీకు ఇంతటి పౌరుషమున్న ఆ శిఖరముపై ఉండు బోయలకు, దొరలకు మరెంత గర్వముండునో కనుక మా అల్లావచ్చి అడ్డు పడినను హిందువులను హతమార్చుట తప్పదని వారి అమ్మవారు ఎట్లుకాపాడునో చూతమని చెప్పిపోడిచిరి. అట్టి తుంటరి మాటలను వృద్ధురాలు లెక్కచేయక మరల వారితో నాయనలారా! మీరు మేము అనుకొన్నా పర్వాలేదు అమ్మను వృధాగా నిందిం చుట వలన మీరు వెనుకకు తిరిగిరాలేరు. భార్యబిడ్డల ముఖాలు చూడలేరని ఖచ్చితముగా చెప్పుచున్నాను. జాగ్రత్త. ఇప్పటికైనా ఆ పంతము వదలి మీ భార్యబిడ్డల చెంతకు వెళ్లి హాయిగా ఉండుట శ్రేయస్కరము. లేదా మీకు అపజయము తప్పదు నా మాట ముమ్మాటికి సత్యమని చెప్పెను.

ఆ మాటలు వింటున్న నవాబు ఓ ముసలిదానా మేము కార్యార్థమై వెళ్ళునప్పుడు అపశకునమైన మాటలు చెప్పుచున్నావు. వృద్ధురాలవని ఇంతవరకు యెన్ని మాటలు అన్నను లెక్కచేయలేదు. ఇక నీ మాటలు సహించము నీకు అమ్మవారు అండ యుండిన నీ ప్రాణమును కాపాడునేమో చూతము అని చెప్పుచు తుపాకితో కాల్చగా ఆమెకు తగులదాయెను. అంతట వారు ఆశ్చర్యపడి ఇది యేమి వింత ఇది దెయ్యమా! భూతమా! మనమేమి చేసినను చలించలేదని యెంచి అందరును చుట్టుముట్టగా ఆమె

అక్కడ నుండి అదృశ్యమై శిఖరముపై అగుపడెను. ఆ వింతగాంచిన మహమ్మదీయులు లెక్కచేయక అది ఒక భూతమని యెంచి ముందు ప్రయాణము సాగించుచుండిరి నవాబు సైనికులకు కొందరికి అప్పటికప్పుడే వాంతులు బేదులు మొదలు పెట్టెను. అంతట వారిలో కొందరు భయభ్రాంతులై దిగులుజెందిరి. అదిగాంచిన నవాబు సైనికులతో మనము ప్రయాసతో తిరుగుటవలన శరీరారోగ్యము దెబ్బతిని ఆ విధముగా జరుగుచున్నదని వారికి నచ్చచెప్పి అచ్చట పడివున్న వారిని వెంటఉన్న రాజవైద్యుచే చికిత్స చేయించి అమ్మవారి ఆలయము చెంతకు చేరుకొనసాగిరి. అటుల వారు పోను పోను అనేక అశుభములు గోచరించెను. వారది లెక్కచేయక ఆలయమునకు దిగువ గల మర్రివృక్షము చెంతచేరిరి ఆ చెట్టు కొమ్మలకు పచ్చినెత్తురు కారుతున్న రెండువేల శిరస్సులు వ్రేలాడుట కనపడెను. ఇంత ఘోరముగా మనవారిని చంపిన శత్రువు లెచ్చట ఉన్నారని వెతకసాగిరి. యెదుట ఆలయముచెంత బోయలు దొరలు కనపడిరి. అదే అదను అని యెంచి సైనికులు ముందుకు దూకిరి.

ఆ సమయమున గూడెమందు ఒక్కస్త్రీకి అమ్మవారుపూని ఖడ్గము చేతబట్టి మరియొక చేత శూలమును బట్టి అందరికంటె ముందుగా మహమ్మదీయ శత్రువుల దరి సమీపమునకు వెళ్ళి ఓరీ తురష్కులారా! ఇప్పటికైనను మర్యాదగ తిరుగముఖము పట్టండి. అటులేని యెడల మీకును మీ వారికి పట్టిన గతే పట్టును. అటుచూడండి అని వారికి వ్రేలాడు శిరస్సులను చూపగా అదిచూచి సైనికులు భయభ్రాంతులై నిశ్చేష్టులై నిలుచుకొనిరి అంతట నవాబు నిన్న జరిగినది మోసము, భయపడక ఈనాడు మీ ప్రతాపము చూపుడని గర్వముతో సైనికులను పురమాయించెను. మానవ రూపమునందున్న అమ్మవారు కోపోద్రిక్తురాలై వారి వంకచూచి ఓరీ గర్వమదాంధులారా! ఇంతవరకు మీరున్ను నాబిడ్డలని యెంచి యింతకాలము సహించి ఉంటిని. ఇప్పుడు మీరు పడే మిడిసిపాటుజాడ మిమ్ములను విడుచుట బావ్యముకాదని తోచుచున్నది. అని చేతి ఖడ్గమును త్రిప్పుచూ వారు చూచునట్లు కత్తిని ఒక పెద్దరాతిపై నరకగా ఆ రాయి నడిమికి రెండుగా నారికేళమువలె పగిలెను. అదిగాంచిన మహమ్మదీయులు ఔరా ఇది మనలను మంత్రతంత్రములతో బెదిరించుచున్నట్టి దయ్యము ఇంద్రజాలము చూపుచున్నదని యెంచి లెక్కచేయక అశ్వములను ముందుకు దూకించి బోయలతో దొరలతో యుద్ధమునకు సిద్ధపడిరి. ఘోరముగా పోరు ఆరంభమాయెను. అంతట మానవరూపము నందున్న అమ్మవారు మెరుపువలె మహమ్మదీయ శత్రువులను యెదుర్కొని హతమార్చుచుండెను. వెనుక ఖడ్గము త్రిప్పి పదిమందిని ప్రక్కకు త్రిప్పి

ఇరువది మందిని ముందుకు తిప్పిన ముప్పై మందిని హతమార్చుచూ యేడు గంటల వరకు యుద్ధము చేసెను. పండ్రెండువేల మంది సైనికులను హతమార్చి వారి శిరస్సులను కొన్ని మర్రివృక్షంబులకు వ్రేలాడదీయించి ఇక శత్రువులు లేనందున ఆగ్రహముతో ఆలయముచెంతకు చేరెను. అక్కడవున్న గూడెము వారికి యేలాంటి గాయములు తగులనందుకు యెవ్వరును మరణించక సజీవముగా ఆలయము వద్దచేరిరి. స్త్రీ రూపము నందున్న అమ్మవారు పోలి పోలి అని బిగ్గరగా కేకలు పెట్టెను.

ఆ దృశ్యమును గమనించినట్టి ఆ గూడెమువారు ఆమెను శాంతింపదలచిరి. వారి మందలలోనికి వెళ్ళి మూడు మేక పోతులను పట్టి తెచ్చి ఆమె ముందు కుంభము కూడు పోయించి ధూప దీప నైవేద్యముల నిచ్చి శాంతులు ఏర్పాటు చేయించిరి కొంత సేపటికి ఆమె ఆగ్రహము తగ్గెను అటు తగ్గిన కొంత తడవునకు మానవ రూపములో వున్న అమ్మవారు ఆమె చుట్టున్న గుంపుగా చేరి జయ జయ ధ్వనులు చేయ గూడెమువారి వంక మెల్లగా కలియజూచి వారినందరిని దగ్గరకు పిలిచి ఓ బిడ్డలారా! ఈనాటికి మన ప్రాంతమందు మహ్మదీయుల దుండగములు అంతరించి పోయెను. కనుక వారివల్ల ఇక ఎన్నటికిగాని హాని కలగదు. ఈ ప్రాంతములకు వారు వచ్చుట కల్ల ఇక జరగబోదు. ఇక నిర్భయముగా ఉండుడని ధైర్యం చెప్పెను. తర్వాత వారితో బిడ్డలారా? నేను మీకు ఇంతవరకూ అండగా వుండి యే ఆపదలు రానివ్వక నా బిడ్డలవలె మిమ్ము కాపాడుకొనుచుంటిని. ఇక నుండి నేను కొంత కాలము ఇటువంటి ప్రదేశములను పరిశీలించి భక్తుల మంచి చెడ్డలను చూచి రావలెనని వెళ్ళుచున్నాను. కావున మీరు తిరిగి ఈ ప్రాంతమునకు వచ్చువరకు మునుపటివలెనే మీ గూడెములకు వెళ్ళి నిర్భయముగా జీవనములు గడుపుడు. నేను ఎక్కడ వున్నను మీరు నాపై మనస్సుంచి సేవించిన మీకు అనేక మగుమేళ్ళు చేకూర్చుచుందును. అదే విధముగా మీరు ఏ పల్లె పట్టణాదుల యందుండినను నన్ను మరువక నేను వచ్చువరకు యేటేట జాతరలు చేయుచు అప్పుడప్పుడు నా ఆలయమును పవిత్రముగా ఉంచి సేవించుడు కొంతకాలమునకు తిరిగి ఇచ్చటికి వచ్చిచేరి నా మహిమలు చూపుదును. భక్తులు కోరిన కోర్కెలు నెరవేర్చు చుందును. వేరు ప్రాంతములకు పోదలచిన నా వల్ల మీరు యే వరము కావలెనో కోరుకొనుడు. మీ కోరిక ఖచ్చితముగా నెరవేర్చుదను అని ఆ దొరబిడ్డలకు బోయబిడ్డలకు అభయమిచ్చెను.

ఆ మాటలు విన్నట్టి భక్తులందరు కొంత తడవు విచారించి ఆమెతో అమ్మా

సర్వేశ్వరీ! భూలోక మాతా! ఆదిశక్తి! నీ అండదండలు ఉన్నంతవరకు మాకు యే కొదవయు ఉండదు. యేభయమున్ను ఉండదు. మాకే కొరతయు లేక క్షేమముగా ఉన్నాము ఇక మాకింతకన్నను. వేరు వరము ఎందులకని ఆమెతో సవినయముగా విన్నవించుకొనిరి.

వారి మాటలు విన్నట్టి అమ్మవారు వారి విశాల హృదయమును గమనించి నాయనలారా! మీకు ఇదే విధముగా నాపై భక్తిభావములు చూపుచుండిన మీ వంశ పారంపర్యముగా మీ ఇంటి ఇలవేల్పునై ఆచంద్రార్కముతోడై మీ కష్టములను కాపాడు చుందును. ఇంకను మీకు యేమైనను సంశయములున్న యెడల తెల్పుడని అడిగెను.

అంతలో ఒక భక్తుడు లేచి ముందుకు వచ్చి "అమ్మా మీరు మాకు ఎన్ని సంప దలిచ్చినను ఐశ్వర్యమిచ్చినను కొంతకాలమేగానీ యేదియు నిలువదు కానీ మీరు మా పై ఆగ్రహము చూపక మామాట కొంత ఆలకించిన యెడల చెప్పెదనని" తడబడ సాగెను. ఆ మాట విన్నట్టి అమ్మవారు అతనినిచూచి "నాయనామీరు నా బిడ్డలు నీతల్లి ముందుట చెప్పుటకు భయమెందులకు నిశ్చయముగా చెప్పమనెను.

ఆ మాటలువిన్న అతడు ధైర్యముతో తల్లి నీవు ఇంకను కొంతకాలము సంచా రముచేసి తిరిగి ఇచ్చటికే చేరెదను అని చెప్పుచున్నావే కాని నీవు మానవుల దృష్టికి గోచరముకావు. నీపేరు మాత్రము కలియుగ మంతము వరకు నిలచి దేశమంతయు ప్రసిద్ది కెక్కుచుండును. మేము మీబిడ్డలగుటవలన మిసేవలు చేసినందున మాపేరున్ను సూర్య చంద్రాదులున్నంతవరకున్ను నిలుచునట్టు అనుగ్రహింపుము. అదే మేము కోరు చున్న వరము. అనివేడుకొనెను.

ఆ మాటలు విన్నట్టి ఆదిశక్తి అమితానంద భరితురాలై వారందరి వంకచూచి బిడ్డలారా మీరు కోరిన విధముగా మీయభీష్టంబులు తీర్చెదననిచెప్పి ఈనాటినుండి ఆ కన బడుచున్న కొండపై కొలువు చేసెదను. దొరలు అభిమానించుటచేతను, బోయవారు కొలుచుటచేతను. కొండపై నిల్చినందువల్లను దొరబోయకొండ గంగమ్మగా ప్రసిద్ది గాంచును. మీ పేర్లు ముందుగా వచ్చునట్లు పెట్టి కలియుగాంతము వరకు నిలుచునట్టుగా పేరు పెట్టెను. ఆనాడు ఆమె పెట్టిన పేరే దొరబోయికొండ గంగమ్మ అనునామము ఈనాటికి స్థిరస్థాయిగా నిలచి రెండవ కైలాసమువలె వెలయుచున్నది. అంతట దొరలు

బోయలు సంతోషముగా ఉప్పొంగి ఆలయము చెంత అనేకమగు వేడుకలు జరిపి బరువైన హృదయముతో వారివారి స్థావరములకు వెళ్లి సుఖముగా నుండిరి.

ఆ విధముగా వారి కోర్కెలు నెరవేర్చిన అమ్మవారు అచ్చిటినుండి మహమ్మదీయుల స్థావరముల చెంతకు వృద్ధురాలివలె వెళ్లెను. అచ్చటి ఉన్న మహమ్మదీయస్త్రీలు ఆమెను చెంతకుపిలిచి అవ్వానీది ఏవూరు నీవు యెందులకు ఈ మార్గమున వచ్చియున్నావు అని ప్రశ్నించగా అవ్వ వారినిచూచి అమ్మలారా నాది ఇక్కడికి ఒక్క ఆమడదూరము నేను ఈ శిఖరమునకు మాగాగ్రిమస్తులతో కలసివచ్చి చాలా రోజులైనది. ఈ అరణ్యమున ఇంతకాలము జీవించుచుంటిని కానీ ఈ నాటికి మహమ్మదీయులు అమ్మచేతిలో హతమగుటవలన ఈ ప్రాంతమంతయు శాంతి యేర్పడినందున నావూరికి పోవుచున్నాను. అని మహమ్మదీయస్త్రీలతో చెప్పగా ఆ మాటలు విన్నట్టి ఆ స్త్రీలు స్పృహతప్పి కుప్పగా కూలిపోయిరి.

కొంత తడవునకు వారుతెప్పరిల్లి లేచి అచ్చట ఉన్న అవ్వపాదములపైబడి అవ్వానీవెచెప్పిన మాటలు యదార్థమైనాయని నిజముతెలిసికొని ఎక్కువ దుఃఖము జెందుచూ హోదైవమా మేము మా భర్తలకు ముందుగనే జెప్పియున్నను మా మాటలు లెక్క చేయక అమ్మవారు అండగావున్న వారిపైకివెళ్ళి ఇట్టి ప్రాణహాని తెచ్చుకొన్నారు. ఇక ఇక్కడ మాకు దిక్కెవ్వరు లేరే ఈ అరణ్యము మధ్యనుండి మా సొంతవూరికి చేర్చువారెవరు? మా భర్తల కళేబరములు కడసారిగా చూచుటకుగూడ మార్గము తెలియదే ఓ సర్వేశ్వరీ! ఆది పరాశక్తి మా భర్తల తప్పులు మన్నించి మా మీద కనికరించి మీ బిడ్డలకు మార్గము చూపు తల్లీ ఓ భవాని! సర్వజనులకు తల్లివినీవే అది తెలియక మా భర్తలు మీచే బలియైనారు. తల్లిచేతనే హతమైరేగానీ మరియెవ్వరును చంపలేదు గదా యనిదుఃఖము జెందుచూ అవ్వను మార్గమును చూపుమని వేడుకొనిరి అప్పుడు వారి బాధను చూచినట్టి అవ్వ వారితోనరే బయలుదేరండి మీకు మార్గము చూపించెదనని వారందరిని వెంటనిడుకొని ఆ అడవి మార్గము గుండా శిఖరముపై వారి శవములు పడి యున్న స్థలమునకు పిలుచుకొని వెళ్ళెను.

అచ్చటికి వెళ్ళినట్టి మహమ్మదీయ స్త్రీలు మట్టి వృక్షమునకు వ్రేలాడ గట్టినట్టి రస్సులను చూచి అటు క్రిందపడియుండు కొన్నివేల శవములను చూచి వారి భర్తలను పర్తుపట్టలేక అచ్చటనే స్పృహతప్పి పడిపోయిరి కొంతసేపటికి అవ్వరూపములో వున్న అమ్మవారి మహిమతో అందరున్ను పైకిలేచి ఆమెనుచూచి అమితముగా దుఃఖింపసాగిరి

అది గాంచినట్టి అమ్మవారు వారిని ఓదార్చి మీరు యేమియు భయము జెందవలదు యే విధముగానైన మిమ్ములను మీ దేశమునకు సురక్షితముగా చేర్చెదనని చెప్పి వారిని వెంటబెట్టుకొని కొండకు పక్షిణభాగమునగల గుట్ట వద్దకు వెళ్ళి అచ్చట ఒక తటాకము చెంతకు పిలుచుకొనిపోయి వారికి స్నానంబులుచేయించి వారిభర్తలు చనిపోయినందులకు కావలసిన కర్మక్రియలు జరిపించి తటాకము సమీపమునగల గుట్టవద్దకు వెళ్ళి వారి గాజులు పగులకొట్టించి తరువాత జరగవలసిన తతంగము సక్రమముగా నడిపించెను.

అటుల వృద్ధురాలు వారి కర్మక్రియలను జరిపించి అచ్చటనుండి వారిని వెంట పెట్టుకొని వారిదేశమునకు పోవుటకు ప్రయాణమై బయలుదేరెను. ఆ విధముగా మహ్మ దీయస్త్రీలను వెంటనిడుకొని పట్టణమునకు వచ్చి వారిమధ్య కలసివెళ్ళుచు వారు నివసించుచున్నట్టి రాజభవనముల గుర్తులు చూపుతూ కొంతదూరము వెళ్ళివారిని తెలియకుండా అదృశ్యమయ్యెను. మాట్లాడుకొనుచు పోవుచున్న వారిని అవ్వకనబడపోగా వారందరు అచ్చట నిలచి తేరి పారచూడ ఆశ్చర్యముజెంది ఇదియేమి వింతయై ఉండును! అరువది ఆమడల నుండి మనకు యేలాంటి అపాయమును కలుగనీయక మనదేశము వరకు వచ్చి ఇంతలో కనబడుటలేదే! అని ఆశ్చర్యముజెంది అపరిసర ప్రాంతమంతయు అందరు కలిసి వెదకి చూచిరి యెందునుగానీ అగుపడదాయెను. అంతట వారందరు ఒకరితో నొకరు ఇదియేమై ఉండును, ఈ వృద్ధురాలు సామాన్యురాలుకాదు సర్వశక్తిసం పన్నురాలైనట్టి ఆదిపరాశక్తియై ఉండునని అట్టితల్లి మనవెంటవచ్చి మనలను కాపాడి నందుకు మనమెంతో కృతజ్ఞులమై యుండవలెను. అట్టి విశాల హృదయముగల ఆదేవదేవిని మనము మరుచుట భావ్యముకాదని చెప్పుకొనిరి. ఆనాటినుండి మహమ్మదీ యులుకూడా అన్ని విధములుగా తోడుపడిన ఆ జగజ్జననిని సేవించుట మొదలిడిరి కష్టం బులందు ఆమెకు మొక్కులిడుచు వారికోర్కెలు తీరినంతనే వారును యేటేట దొరబోయి కొండ శిఖరమునకు వచ్చి మ్రొక్కుబడులు చెల్లించుకొని పోవుచున్నారు. ఆనాడు వారు పెట్టిన విధముగా ఈనాడున్ను మహమ్మదీయులువచ్చి అమ్మవారిని సేవించుకొని వెళ్ళుట ఈనాటికిని కానవగును అమ్మవారున్నూ వారి బిడ్డలకు అనేక విధములుగా తోడుపడి అశిఖరముపైనే రెండవ కైలాసముగా వెలయునట్లుచేసి ప్రశాంతము గంభీరముచే దొర దోయకొండ శిఖర ప్రాంతము సంతరించుతూ తపోనిష్ట జరుపుచున్నది.

ఇప్పటికినీ కొండపైన ఆనాడు నివశించిన ప్రదేశములు నల్లమందు గెరిసెలు ప్రాకారములు కలవు ఆలయమునకు తూర్పుపై భాగమున ఆనాడు అమ్మవారు సేదతీర్చు కొనుటకు ఆమె మహిమచే ఏర్పడినట్టి చిన్న సరోవరము ఇప్పటికిని ఉన్నది అందులో

యెట్టిక్షామ పరిస్థితుల యందైనా ఎంతనీరు వాడినను తరగకుండా ఉండును. దీనిని నిదర్శనముగా చూడవచ్చును.

మరియు ఆమె ఆ ప్రాంతమున తిరుగుచూ విశ్రాంతి సమయమున ఉయ్యాల ఊగుచున్నట్టి ప్రదేశము ఇప్పటికిని ఉయ్యాలగుండ్లు అని పిలుచుచుందురు. అక్కడి ప్రదేశము ప్రశాంత వాతావరణముతో నిండి ఉండును.

అదియుగాక ఆనాడు అమ్మవారు మహమ్మదీయసైన్యముతో విసరగా నారికేళము వలె దబ్బలుగా చీలిన పెద్దరాయి ఇప్పుడును గోచరమగును.

కొండకు దక్షిణభాగమున మైదానమునుండు ఒక పెద్దరాయి కనబడును అచ్చటనే వారిస్థావరములు నాడు పట్టపు యేనుగును కట్టిన రాతిని చూడనగును. అది ఇప్పుడును ఈ నాటికి ఏనుగుగుండు అని పిలువబడుచున్నది,

ఆనాడు మహమ్మదీయస్త్రీలకు కర్మక్రియలు జరిపిన స్థలము ఇప్పుడునూ ఉన్నది ఎవరైనా ఆ ప్రదేశమునకు వెళ్ళి అక్కడక్కడ చిన్న గుంతలు త్రవ్విచూచిన ఆనాడు పగులగొట్టబడిన గాజులు ఇప్పుడును పైకిలేచునట్టి వింతచూడవచ్చును. అందువలన ఆ గుట్ట ఇప్పుడుకూడా ముండమోపులగుట్ట అని పిలువబడుచున్నది.

కావున దొరబోయకొండకు వెళ్ళు భక్తాదులు పైన తెలిపిన ప్రాంతమంతయు పరిశీలించిన పై విశేషములు గోచరమగును. అదే విధముగా ఈ నాటికి కూడా ఆ తల్లి చూపిన మహిమలు ఉదాహరణకు ఈ క్రిందకొన్ని దృష్టాంతము లివ్వబడినవి.

1) 1975వ సంవత్సరము నందు తిరుపతివాసులు కొందరు అమ్మవారిని సముఖము నకు మ్రొక్కుబడులు తీసుకొని వెళ్ళి ఆ తల్లిసన్నిధానమందుండు కోనేటిలో పచ్చగానున్న ఆ నీరు త్రాగుటకు సంశయమొంది వడగట్టి త్రాగినందున వారు అప్పటికప్పుడే స్పృహతప్పి పడిపోయిరి ఆ దృశ్యమును అచ్చటఉన్న భక్తాదులు గమనించి పూజారులతో చెప్పగా వారు అచ్చటికివెళ్ళి తీర్థములనుచల్లి బండారు బొట్టుపెట్టిన కొంత తడవునకు వారు పైకిలేచిరి అంత అచ్చటఉన్న భక్తాదులు వారిని ఇట్టిస్థలమునకువచ్చి ఇట్లుచేయుట పొరపాటు అని మందలించి ఈ పనిచేయరాదని చెప్పగా అంతటవారు అమ్మవారి వద్దకు వెల్లి తప్పుచేసినందుకు మమ్ము మన్నించవలెనని అనేక విధములుగా మ్రొక్కుకొని అక్కడ అందరు చేయురీతిగా వారున్ను ఆ నీటితోనే వంట చేసుకొని భుజించి ధన్యు

లై రి. ఆనాటి నుండి అచ్చట జరుగు మహిమలు తెలుసుకొని యేటేట వారున్ను వచ్చి అమ్మవారిని సేవించుకొని పోవుచున్నారు.

2) 1978వ సంవత్సరము దిగువపల్లెగ్రామం మేకతోళ్ళపల్లెలో ఉన్నట్టి కాపువారు అమ్మసాన్నిధ్యమునకు వెళ్ళిరి. అమ్మవారిని సేవించుకొని ఆనందముతో అచ్చోరి వారితో కలుసుకొని తిరిగి ప్రయాణమైనప్పుడు వారి బిడ్డలు ముగ్గురు తప్పిపోగా వారు దిగులు పడి ఆందోళన చెందిరి. అమ్మవారి కృపాకటాక్షమున ఆ కొండ ప్రాంతమందుండు ఇర్లవారు ఆ బిడ్డలను తీసుకొనివచ్చి వారి తల్లి దండ్రులకప్పగించిరి.

3) 1978వ సంవత్సరము పుంగనూరు తాలూకా సోమలగ్రామంలో ఒక నడి వయస్సుగల స్త్రీకి అకస్మాత్తుగా నోటిమాటలు పడిపోవుటచే వారు చాలమంది వైద్యులకు చూపించినా నయముకాక కొన్ని రోజులు దొరబోయకొండ, అమ్మవారి చెంతకు వెళ్ళి మొక్కుబడులు చెల్లించి ఐదువారములు అమ్మవారిని సేవించ ఐదవ వారమునాటు ఆ స్త్రీ మునుపటివలె నోటిమాటలు వచ్చి అమ్మవారిచెంతనే మాటాడుట మొదలుపెట్టెను.

4) 1980వ సంవత్సరం నందు పుంగనూరు తాలూకా ప్రాంతమువారు కొందరు మర్రిదుస కుటుంబసమేతముగా దొరబోయకొండకు వచ్చి అమ్మను సేవించుకొని అక్కడ జరుగ వలసిన కార్యక్రమములు జరుపుకొనుటలో ప్రొద్దు పోవుటచే ఒకరినొకరు గమని చక వేరువేరు త్రోవల వారి నివాసముఖ చేరుకొనిరి. అందువారి గుంపులో ఒక ఇంటిబిడ్డలు తప్పిపోవుట గమనించి వీళ్ళను, వాళ్ళను అడుగగా ఎవ్వరును మాచెంతరాలేదని చెప్పిరి ఆదివిని వారి తల్లి దండ్రులు దిగులుజెంది యెక్కడవున్నారో యేమైనారోయని భయపడి తిరిగి బోయకొండకు కొందరిని వెంటనిడుకొని బయలుదేరి కొండ క్రిందకు వచ్చిరి అప్పటిరాత్రి ఎక్కువైనందున అమ్మవారి ఆలయమునకు పోవుటకు భయపడి కొండ క్రిందనే ఉండి తెల్లవారకమునుపే శిఖరముపైకి పోవుచుండగా అమ్మవారు వారిబిడ్డలను వృద్ధురాలి రూపములో వారిచెంతకు చేర్చెను అప్పుడు వారి తల్లిదండ్రులు బంధువులు ఆ బిడ్డలను కౌగలించుకొని నాయనలారా మీరు రాత్రి యంతయు ఎచ్చటి ఉంటిరి? యే బాధ పడితిరి? అని ఆవేదనతో వారిని అడుగగా అందుకు ఆ బిడ్డలు మేము యే బాధలు పడలేదు రాత్రి అంతయు క్షేము మా అవ్వదగ్గర ఉంటిమి అవ్వమాకు ఫలహారములుకూడా ఇచ్చెను తిరిగి మమ్మలను మీ వద్ద విడిచి వెళ్ళినది. ఆ అవ్వయే ఈ మార్గముగుండానే వెళ్ళెనని ఆ పసిబాలురు చెప్పగా వారందరు ఆశ్చర్యము జెందిరి. ఇది జరిగిన సత్యము.

5) 1985వ సంవత్సరము శివరాత్రిరోజు వేంపల్లి గ్రామం కోళ్ళోల్లపల్లిలో కాపుర ముండు మడవలివారు కొండకు వెళ్ళినప్పుడు వారిబిడ్డ తప్పిపోగా ఆ బిడ్డ ఆ రాత్రి అంతయు అమ్మవారి సాన్నిధ్యమునందుండి తెల్లవారిన తరువాత వెదకి కొంటూవచ్చిన వారితల్లి. తండ్రుల దగ్గర చేరెను.

6) 1985వ సంవత్సరము చిత్తూరు జిల్లా మదనపల్లె తాలూకా కోటావారిపల్లి నివా సులు అమ్మ సన్నిధానమగు బోయకొండకు ట్రాక్టరులో వెళ్ళుచుండు సమయమునమార్గ ములో ఒక నాగుపాము ఎదురురాగా దానిని లెక్కచేయక తాచ్చారముచేసి వెళ్ళిరి. అది యుగాక వారిగుంపులో ఒకస్త్రీ అమ్మవారి కోనేటినీళ్ళు శుభ్రము లేదని యెగతాళిచేసి పవిత్రస్థలమున దుర్నడవడికలు నడిచినందున ఆమె ప్రవర్తనకు అమ్మవారు తగు ప్రాయశ్చితం చూపినది. ఎటులంటే మదనపల్లి తాలూకా రెడ్డివారిపల్లి గ్రామం. పిట్టావాండ్లపల్లె సమీపమున అర్ధకిలో మీటరు దూరమున చదరముగా ఉన్న బాటపై పోవుచున్న ట్రాక్టరు అకస్మాత్తుగా బోల్తాపడినది. అందులో కొందరు యే అపాయము లేక మిగిలిరి, దుర్నడవడికలు చేసినస్త్రీ అక్కడికక్కడనే ప్రాణావస్థజెంది ప్రభుత్వ ఆసుపత్రిలో ఆ రోజే మరణించెను. కనుక అమ్మను సేవించుటకు వెళ్ళునప్పుడు జాగ్రత్తగా వెళ్ళవలెనని నిర్మలమైన మనస్సుతో వెళ్ళుట చాలా మంచిది ఇది ము. ముగా గమనించతగ్గ విషయము.

అదియుగాక కర్నాటక స్టేటు బెంగళూరులో కొందరికి అమ్మవారు అనేక విధ ములైన మేళ్ళు చేయుటచేతను వారికి సాక్షాత్తుగా గోచరము అగుట వలననూ వారు ప్రతి సంవత్సరము ఆ తల్లికి అభిషేకములు చేయుచు ఆనందింపజేసి కృతార్థులు అగు చున్నారు. వారు ఆనాటినుండి ఈనాటివరకు ఆమె శిఖరమునకు వచ్చి ఆమెను దర్శించి వెళ్ళుచున్నారు. నమ్మినవారిని అమ్మవారు అండగా వుండుట సత్యమైన మాట.

అమ్మవారి మహిమలు కనుగొనవలెనని యెవ్వరైనా బోయకొండ శిఖరముపైకి రాత్రిపూట వెళ్ళి గమనించిన యెడల ఎప్పుడో ఒక పొద్దున అమ్మవారు ఆలయము లోనికి వచ్చుచూ వెళ్ళునప్పుడు అందెల చప్పుడు వినవచ్చును. ఇది యదార్థం!

అదియుగాక ముఖ్యముగా డిశంబరు జనవరి నెలలలో వెళ్ళినయెడల అక్కడి మహిమ కన్నులముందే చూపుదురు. దానిని పరీక్షించవలెను.

మరియొకటి యెవ్వరైనను ప్రయాణ విషయములకు ఎక్కడైనను శుభకార్య

ములకు వెళ్ళునప్పుడు మడి మైలు తగులకుండా అమ్మవారి బండారు నోసట పెట్టుకొ
వెళ్ళిన యెడల వారుపోయినపని జయప్రదముగా జరుగును.

యెవ్వరికైన పసిపిల్లలకు బాలగ్రహదోషములుగాని, చిన్నపిల్లలకు కిసురులాం
వ్యాధులుగాని కనపడినప్పుడు వారిఇండ్లను శుభ్రపరచి అమ్మవారి బండారు వారికిపె
మ్రొక్కుకొన్న యెడల వారి ఆరోగ్యం ఖచ్చితముగా చక్కబడును ఇదిముమ్మాటికి సత్య

అదియుగాక యే గ్రామాదులయందు పట్టణాలయందుగాని పైరుపంటలు
వృక్షములకుగాని చీడపురుగులవల్ల పంటలు చెడిపోవుట తటస్థించిన అమ్మవారి సని
మునకు వచ్చి తీర్థములు బండారు తీసుకొని వెళ్ళి వాటిపై చల్లిన ఆ చీడపురుగులు చ
ఆరోగములు త్వరలోనే తగ్గి పంటలకు హాని జరగదు. ఈ విషయము ఇప్పుడుకూ
జరుగుచున్నది.

దొరబోయకొండ శిఖరముపైన ముఖ్యమైన విషయము యేమనగా అచ్చ
ఆనాడు అమ్మవారి మహిమచే నిర్మితంబైనట్టి కోనేరు ఆలయము యెదుట వున్న
అందుగల నీరు ఆనాడు సృష్టించిన రీతిగా ఈనాటును యెంత శుభ్రపరచినను పచ్చగ
వున్నది. మానవులు మార్చలేము అట్టినీటిని అచ్చటికి వెళ్ళిన భక్తాదులు అసహ్యించ
వాడుటవలన మీ బాధలు వుండవు. ఎగతాలిగా తాచ్చారము చేసిన కొన్ని బాధలకు గు
కాక తప్పదు కావున భక్తాదులు ఈ విషయమందు జాగ్రత్త వహించవలెను. ఇది దై
నిర్ణయంబుచే ఏర్పడినదేగాని మానవ నిర్మితముగాదు. ఇది అన్నిటికన్నను క
ముఖ్యమైన సత్యం

ఇంతటి మహత్తుగల దొరబోయకొండ గంగాభవానిని భక్తులుసేవించి తరింతురుగా



-సమాప్తం-